JAGATI Rs. 5-00 Deepavali 1992

38th Year of Publication




135

# 436

## దీపావళి - 1992

## సాహితీ సుధ

మంచి చెడ్డలు మనుజులందున - యెంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే - మాలనే అగుదున్

—గురజాడ

పాయలు పాయలుగా విడి - పోయిన నా తెనుగుకన్నె ముంగురులకు వే
ణీ యోగ్యాభరణముగా - నీయెడ జడకుచ్చు అల్లి యిచ్చితి బ్రీతిన్

—రాయప్రోలు

మరల నిదేల రామాయణం బన్నచో - నీప్రపంచ మెల్ల వేళ
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్లు - తన రుచి బ్రతుకులు తనవి గాన

—విశ్వనాథ

రాజు మరణించె నొక తార రాలిపోయె - కవియు మరణించె నొక తార గగనమెక్కె
రాజు జీవించె రాతి విగ్రహము లందు - సుకవి జీవించె ప్రజల నాలుకుల యందు

—జాషువా

చిరకాలం జరిగిన మోసం - బలవంతుల దౌర్జన్యాలూ
ధనవంతుల పన్నాగాలూ - ఇంకానా ! ఇకపై చెల్లవు

—శ్రీశ్రీ

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004.
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00- 4 సం॥లకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - 1000-00. విదేశాలకు : అ॥ డాలర్లు 75.

నా చిన్నతనంలో

# దీపావళి

## దేవులపల్లి కృష్ణశాస్త్రి

నా చిన్నతనంలో దీపావళి!

"మీ చిన్నతనంలో దీపావళి ఎలా గుండేదో జ్ఞాపకం చేసుకొని వ్రాస్తారా ?" అని నన్ను అడగడం చూడండి! ఒక్కసారి మనస్సులో ఒక్క నీడ ముసురుకొని జరిగి నట్లయింది. చిన్నతనం నెమరు వేసు కోవలసినంత వార్ధక్యం నాకు వచ్చిందా అని.

ఇదివరకు నాకీసంగతే తోచలేదు. పనికట్టుకుని ఎప్పుడూ బాల్యంలోకి ప్రయాణం చెయ్యలేదిది వరకు.

"మా కృష్ణశాస్త్రి ఎప్పుడూ ఇరవై యొక్కయేడు దాటడు" అని మా గురుదేవులు నాయుడుగారు నన్ననేవారు. ఆయన అనడమే ఆశీర్వచనం అయిపోయేది. కనుక నేనలాగే కొట్టుకొని వచ్చానింత వరకూను.

* * *

నా చిన్నతనంలో దీపావళి! - జ్ఞాపకం చేసుకుంటూ. ఒక్కొక్క దీపావళే మెట్టుగా వెనక్కి జరగా లన్న మాట! ఇంకా వెనక్కి!

నేనెరిగున్న మొదటి దీపావళి ఏది చెప్మా! కొంతదూరం వెనక్కి జరి గాక, దీపావళులన్నీ ఏకమై పోవడమే కాక, దీపావళీ సంక్రాంతీ విజయ దశమీ పండుగలన్నీ కలిసి పోతు న్నాయి. వాసనలూ వన్నెలూ కలిసి పోవడం మరీ వింత!

నాకెప్పుడూ వివరాలు జ్ఞాపకం వుండవు. వెరసి ముద్రలవంటి కొన్ని స్మృతులుంటాయి. "దీపాలు, దివి టీలూ, పచ్చతోరణాలు, పట్టు తోరాలూ, మారేడు పత్రాలూ, మందారపు పువ్వులూ, మంత్రాలూ, పట్టు పంచలూ, ప్రదక్షిణాలూ, హార తులూ, మా నాన్నగారూ అన్నీ కలిసి పోతే, వీటిలో నుంచి దీపావళిని విడ దీసుకోవాలి.

* * *

మా నాన్నగారు ప్రతి పండుగనీ ఒక ధోరణిలో దగ్గిరుండి నడిపించే వారు. నా దీపావళి స్మృతులన్నీ సుఖప్రదమైనవి కావు.

నరక చతుర్దశినాటి తెల్లవారిగట్ల తలగడుగు అసలేకాదు. ఎంత మాత్రమూ కాదు. తెల్లవారకముందు లేవడం నాకెప్పుడూ ఇష్టంలేదు. ఎవ రేమి చెప్పినా అది మంచిదికూడా కాదని నా సిద్ధాంతం.

"తల్లి నీకు రేయి చల్లని యొడిపైని
నిదురపొమ్ము ; నిదుల నిదురకొక్క
కలవెలుంగు జిలుగు జలతారు అంచురా !
మేలుకొనకు కలల వేళ - తండ్రి !

అని నా ప్రబోధం - నరకుడా సమయాన చచ్చిపోయాడు కనుక నరక చతుర్దశి అన్నారట! తలగడుగు వల్ల నాకు నరకబాధ కనుక నరక చతుర్దశి అని నా మతం.

దీపావళినాడు మాత్రం బాగుండేది.

ఓ, దీపావళినాడు చాలా బాగుండేది. దీపావళి నాడు పగలెక్కువ పొదుగు - న ర కు డి ఉసురులాగ ఊరికే తెగసాగుతుంది ఆ రోజు.

అయినా రకరకాల బాణసంచాలు ఏరడం. ఏరి ఎండబెట్టడం. ఎండ బెట్టుతూ ఒక్కొక్కదానికేసే ఇష్టంగా చూసి పలకరించడం. ఎండబెట్టినవి బుట్టలో పెట్టి లోపల బెట్టడం. బైటికి వెళ్ళడం. మళ్లీ వచ్చి బుట్టలో ఉన్న బాణసంచాల్ని పలకరించడం. మళ్లీ వెళ్లడం. మళ్లీ రావడం. పరధ్యానంగా నిలబడి ముని మాపుని ఆహ్వానించడం పగలల్లా ఇదీ ధోరణి.

బాణసంచాల్ని ఏ రే ట ప్పు డు మాత్రం. కొంత బాధ ఉంది. ఏతండ్రి అయినా బజారు బజారంతా ఎత్తుకొని రాలేడు కదా !

✠ ✠ ✠

సాయంకాలం సమీపిస్తూఉంటేనే లోకం అంతా మారిపోతూంది. ప్రతి రాత్రి వాకిట్లోనూ చీకటి కావలి కాస్తుంది దీపావళి రాత్రి హజారంలో వెలుగు పహరా ఇస్తుంది.

దీపావళి రాత్రి మహరాజు కాగడాలతో. కాహళలతో కంచు ఢక్కాలతో వస్తుంది.

ఆ సాయంకాలం అమ్మా. అక్కయ్యా వేలకొద్ది ప్రమిదల్లో నూనె నింపి దీపాలు వెలిగిస్తారు.

ఛాబా గోడ అంచులనుంచి దీపాలు తలలు ఎగరేస్తుంటాయి. అరుగుమీద దీపాలు అటూ ఇటూ ఆడిపోతాయి. కిటికీలోనుంచి కొన్ని దీపాలు కన్నుగీటుతాయి. కొన్ని రాణివాసపు టోర చూపులు చూస్తాయి.

అంత పండుగరోజున కూడా కొన్ని దీ పా లు కునుకుతాయి ; మాగన్ను పెడతాయి. జోగుతాయి. మరికొంత 'స్నేహం' చూపిస్తూ అమ్మా, అక్కయ్యా వాటిని మళ్లీ మళ్లీ బుజ్జగిస్తూ మేల్కొలుపుతారు.

దీపాలకి కూడా సిగ్గు, విలాసమూ, బడాయి, బద్ధకమూ అన్నీ ఉన్నాయి.

☘ ☘ ☘

ఇంతలో గోగుకొమ్మలు వస్తాయి ; వాటి రెమ్మలకు వత్తులు కట్టి వెలిగిస్తాముకదూ ! తాటాకు గుమ్మడి పళ్లూ ఆ గుమ్మడి పళ్లలో ఉమ్మెత్త కాయల డిప్పల ప్రమిదలూ. ఆ ఉమ్మెత్త ప్రమిదల్లో నేతిదీపాలున్నూ.

ఎడమ చేతిలో తాటాకు గుమ్మడి పండు పట్టుకునీ కుడిచేతిలో గోగు కొమ్మలు పట్టుకునీ ఆ దీపాల గోగు కొమ్మని ఒక్కసారి నక్షత్రాలకు చూపించునట్లు ఎత్తీ, దించీ,

"దిబ్బూ దిబ్బూ దీపాలమావాస్య
మళ్లీ వచ్చే నాగుల చవితీ
ఎప్పుడు తిందుము చిమ్మిలిముద్ద !
ఎప్పుడు తిందుము చలిమిడిముద్ద !"
అంటూ మెట్లముందు కొట్టిపారేసే
వాళ్లం.

చాలాకాలందాకా 'మళ్లీ వచ్చే నాగుల చవితి' అనే రెండో పాదం బాగుండేదికాదు నాకు. యతి లేక పోవడం వల్లనేమో !

"దిబ్బూ దిబ్బూ దీపాలమావాస్య మళ్లీ వచ్చేను" అని ఆగి పోయేవాణ్ణి. అయినా ఈ పాదంలో ప్రబోధం. సందేశం, ఆశావాదం ఉన్నాయి. 'నాగులచవితి రోయ్ అని !' ఇది కేవలమూ కళకోసం సాహిత్యం కాదాయెను.

* * *

ఇప్పుడు చటుక్కున జ్ఞాపకం వస్తుంది. చిన్నతనం దాటిపోతూన్న రోజుల్లో వ్రాసిన దీపావళి పద్యం ఒకటి. రాజాస్థానపు టాశ్రయపు రోజులవీ.

"తమ యశమ్మారిపోని మతాబుపోలు ;
ఆశయములు జువ్వలుగ మిన్నంటి
దిగవు ;
బాణ సంచుల ఫెళఫెళార్భటులటు తమ
ప్రజల కరతాళములు రేబవళ్లు మ్రోగు
ఓ భూలోక దేవేంద్రా !" అంటూ.

దీనికంటె నాకు 'దిబ్బు దిబ్బు' పద్యమే తరువాత బాగుంది - అది నాది ; నా బ్రతుకు ; 'భూలోక దేవేంద్రుడు' లాగ అసత్యంకాదు.

* * *

అన్నట్టు ! బాణాసంచాలు వెలిగించేముందు తీపి వస్తువులు తిని రావాలి. మా అన్నయ్య తీపి వస్తువులు తినడం వద్ద దిగబడి పోయి బాణసంచాలదాకా రాలేకపోయేవాడు అతనికి ఏకాగ్రతకూడా ఎక్కువ "వర్క్ వైల్ యు వర్క్, ప్లే వైల్ యు ప్లే" అనే మంచి పిల్లవాడి జాతిలోనివాడు.

"ఏమ్రా ! కాకరపువ్వు వత్తులు వెలిగించరేం ? వెలిగించారర్రా !" అని లోపలనుంచి అప్పుడూ ఇప్పుడూ హెచ్చరిస్తూండేవాడు.

ఆ రోజుల్లోనే అతగాడు గట్టి వాస్తవికుడు ; మరునాటికి కొన్ని మతాబాలు, జువ్వలూ మిగిలిపోయేవి కానీ ఒక్క పాకపుగారి అయినా మిగిలేదికాదు.

పండుగ జేగీయమానంగా జరిపించడానికికూడా పరాక్రమమూ పట్టుదలా కావాలి. మా రా .. అన్నయ్య 'ఒకనాడు' ఉన్న ఆంధ్రవీరుల్లో వాడు.

* * *

బాణాసంచాల్లో నాకు నేస్తాలూ శత్రువులూ ఉన్నారు. అంటే ఉన్నాయి. చప్పుళ్లు చేసేవి నాకు ఇష్టంలేదు. పటాష్‌కాయలూ ఔట్లూ వంటివి. సిసింద్రి నాకు పరమ శత్రువు, బందరు తూటాకూడా.

సిసింద్రీ ధర్మయుద్ధం చేసే రకం కాదు. దీని శీలం సంగ్రహంగా వర్ణిస్తే అమర్యాదా మోసమూ ప్రధాన గుణాలుగా చెప్పాలి - నడకా, పరుగూ, ఎగురూ, ముందుకు పోతూ

ఇట్టే వెనక్కి తిరగడం. అనుకోకుండా నీవైపు తిరిగి నీమీద దూకేటట్టు నిన్నే తీవ్రంగా చూడడం, సిసింద్రీ చెడుగుడి ఆడుతుంది. సిసింద్రీ అంటే నాకిష్టం లేదెప్పుడూ.

మతాబాలు, కాకరపువ్వు వత్తులూ, కాకరపువ్వు వత్తులు కాలుతున్నప్పుడు ఎగిరే పువ్వులు కొంచెం కొంచెం చేతిమీద పడి చిరు చిరుక్కుమనడం, మతాబాలు కాలుతున్నప్పుడు జారే నిప్పు గోళీలు నీటిలో పడుతూ మనోహరంగా గుళుక్కుమనడం, ఎర్ర వెలుగూ, పచ్చవెలుగూ, నీలివెలుగూ, ఇంటిముందు ఇంద్రధనస్సులు పొడవడిమూ పోవడమూ, చిచ్చుబుడ్డూ, వెలుగు పొదలూ.... ఇదీ అసలయిన దీపావళి.

ఈ సందడిలో నా మనస్సును రెండు చెదరికొట్టేవి, ప్రక్కనే పేలే బాణసంచాల దౌర్జన్యం, దూరాన చీకట్లోకి ఆకాశంలోకి ప్రాకుకుపోయే అగ్నిసర్పాలు తారాజువ్వలూను.

ఓ! తారాజువ్వలు విసిరేవాళ్లు భారతవీరులు ః వాళ్లు మా పిఠాపురంలో ఊరి బయట జువ్వలతో వెలగకాయలతో ఎలాగ యుద్ధంచేసే వాళ్లో దగ్గిరగా ఉండకుండా చూడాలనిపించేది.

నా బాల్యం అప్పుడప్పుడు విజయనగరంలో సాగింది. 'అయోధ్య

మైదానం మీద వెలక్కాయలతో రామరావణ యుద్ధాన్ని గూర్చి వినే టప్పుడు ఊపిరి వదిలేవాళ్ళం కాము.

నాకిష్టం అయింది ఇంకొకటి ఉంది. అది పాముల మందు. ఎవరే మన్నా సరే, నవ్వినా సరే, పాముల మందు అద్భుతమైనది అంత చిరు ముక్కలో నుంచి అంత పెనుపాము రావడం - అందులో అంత నిర్విష మైనది!

ఇంతలో దీపావళి అయిపోవస్తుంది. 'నాగుల చవితికి నాలుగు మిగల్చం డ్రా' అంటారు. ఆ మిగల్చడం నాకు ఇష్టమూ ఉండేది కాదు. తెలియనూ తెలియదు. దిగులుగా లోపలికి పోయేవాళ్ళం.

అన్ని పండుగల్లో దీపావళి నాకు ఇప్పటికీ ఎంతో ఇష్టం. నా పిల్లలకి ఎందుకో అంత ఉత్సాహం కలిగించదీ ఉత్సవం. నాకంటే ముదిరి పుట్టారా? తెలియకుండానే లోక బాధలూ బరువూ మోస్తూ పుట్టారా? ఇప్పటికీ నేనే మతాబులూ అవీ కొనడమూ, నేనే సగం కాల్చడమూను!

❋ ❋ ❋

దీపావళి రోజున నాకున్నంత ఉత్సాహం ఆరాత్రికి లేదనిపిస్తుంది. పాపం, దీపావళి రాత్రివేళ చిమ్మటలతో ఏకాంతవాసంచేసే మహాకవినీ నేనెరుగుదును.

నా యింటీ ముంగిటా నీ యింటీ ముంగిటా వన్నె వన్నెల వెలుగుల్లోకి నీడలు ప్రాకుకుంటూ వస్తుంటే మీరు చూశారో లేదో; సిసింద్రీ పువ్వుల వంటి నీడలు, ఈ నీడలు ఆ రోజుల్లోనే నా గుండెల్ని మధ్య మధ్య పొడుస్తూండేవి. కాలనివయినా, పొర పాటున జారినవయినా, దొరుకుతా యేమో అని ఏరుకుందుకు చాచే చేతులు, ఇప్పుడు తారాజువ్వలలాగ లేస్తున్నాయి; అప్పుడు మూలుగులు లాగ నా లోపలికి పైకీ చీకటిలోకి ప్రాకేవి.

మేము అప్పుడు చిరాకు పడే వాళ్ళం. వాళ్ళ అక్కర మమ్మల్ని ఎత్తి పొడచినట్లుండేదో. వాళ్ళకి నాలుగు పడెయ్యలేకో, చిరాకుపడే వాళ్ళం - అసలు నాలుగు పడెయ్యడ మనేదో అపత్కరమైన ధోరణి.

❋ ❋ ❋

మరునాడు వీధి వాకిలి చూస్తే దిగులు దిగులుగా ఉండేది; వంట ఇలు చూస్తే హా రా ... అన్నయ్యా కున్నట్లు.

ఆ పేదపిల్లలికి ఏవయినా దొరి కాయో లేదో! ఏకట్లో దూరాన్నుంచి ఎంత ఆకలితో చూశారు - అలాంటి చూపే చెప్మా నాపిల్లల కళ్ళలోనిది ఇప్పుడు.

చిత్రం! అన్నం కోసం ఎంత ఆత్రతతో అన్వేషిస్తారో వెలుగు కోసమూ అలాగే వెదకుతారు కాబోలు - ఇప్పుడు దీపావళి పద్యము వ్రాయగలిగితే ఎలాగ వ్రాస్తానో!

—'బుజ్జాయి' సౌజన్యంతో

మద్రాసులోని మొదటి
కాంగ్రెస్ మంత్రివర్గం

# స్మృతి సౌరభం

## డా॥ బెజవాడ గోపాలరెడ్డి

కాంగ్రెస్ ప్లీనరీ సమావేశాలు తిరుపతిలో జరుగుతున్న సందర్భంలో 'ఆంధ్రజ్యోతి' ప్రత్యేక సంచికను వెలువరించడం ముదావహం. రాయలసీమలో ఇదే కాంగ్రెస్ తొలి సమావేశం. పానగల్లు రాజా, మునుస్వామి నాయుడు, జస్టిస్ పార్టీ దినాలలో ఉమ్మడి మద్రాసులో ముఖ్యమంత్రులుగా వున్నారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన పిదప నీలం సంజీవరెడ్డి, దామోదరం సంజీవయ్య, కోట్ల విజయభాస్కరరెడ్డి రాయలసీమ నుంచి వచ్చిన ముఖ్యమంత్రులే. అనంతశయనంగారు లోక్‌సభ స్పీకర్‌గా, బీహారు గవర్నర్‌గా వ్యవహరించారు. ఈ నేపథ్యంలో తిరుపతిలో కాంగ్రెస్ మహాసభ జరుగుతున్నది. ప్రస్తుతం కేంద్రంలో ఆంధ్రుడే ప్రధానిగా వుండడం ఈ మహాసభలకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నది.

1937-38 మధ్య మద్రాసు మంత్రివర్గం సంగతులు రాయమని నన్ను కోరినారు. పాత జ్ఞాపకాలు నెమరు వేసుకోవలసిన స్థితి. ఈ సింహావలోకనంలో ఆనాటి మా తోటి శాసన సభ్యులు, మంత్రులు చాలా మంది లోకమును వీడి అదృశ్యమై పోయినారు. ఆంధ్ర జిల్లాల్లో మిగిలి వున్న వారలలో కర్నూలు నుంచి నాగప్ప, పశ్చిమ గోదావరి నుంచి అమ్మన్న రాజా, కృష్ణా జిల్లా నుంచి కాట్రగడ్డ నారాయణరావు, వెల్లూరు నుంచి నేను మిగిలివున్నాం. ఆనాటి మంత్రులలో, పార్లమెంటరీ కార్యదర్శులలో, స్పీకరు, డిప్యూటీ స్పీకరు పదవులలో పనిచేసిన వారిలో మాత్రం నేనొక్కడినే బ్రతికి వున్నాను. పాతకాలాల అవశేషంగా నిలచిన స్తంభంగా వున్నాను. తమిళ జిల్లాలలో ఒక్క ఎం.ఎల్.ఎ. (ఎల్. కృష్ణస్వామి భారతి) బ్రతికి వున్నారు. మలబార్ నుంచి, కర్నాటకనుంచి ఎవరూ లేరు. మొత్తం మద్రాసు శాసనసభలో ఆనాడు పనిచేసిన వారలలో అయిదుగురు మాత్రం మిగిలి వున్నారు. ఇది ఒక విషాదమైన గాథగానే కనిపిస్తున్నది. అయినా చేయ

గలిగిందేమీ లేదు. శిరసావహించి స్వీకరించవలసిందే.

✠ ✠ ✠

అసలు కథకు వస్తే 1937 ఫిబ్రవరిలో 1935 నాటి చట్టం క్రింద మద్రాసు రాష్ట్ర శాసనసభ ఎన్నికలు జరిగినవి. ఆనాడు కాంగ్రెస్ ప్రెసిడెంటు జవహర్‌లాల్ నెహ్రూ, పార్లమెంటరీ బోర్డు అధ్యక్షుడు సర్దార్ పటేల్. ఉమ్మడి మద్రాసులో ఎన్నికలు జరిగిన సీట్లలో మూడు జనరల్ సీట్లలో మాత్రమే కాంగ్రెస్ ఓడిపోయింది. గొట్టిపాటి బ్రహ్మయ్యను ఓడించి చల్లపల్లి రాజావారు జస్టిస్ పార్టీ తరపున గెలిచారు. గోపాలరావును ఓడించి గ్రంధి వెంకటరెడ్డి నర్సాపురం నుంచి ఎన్నికయ్యారు. తమిళనాడులో భక్తవత్సల నాయుడు ఆర్కాట్ నుంచి గెలుపొందినారు. ఇక ఆనాడు మహమ్మదీయులు, క్రైస్తవులు, భూస్వాములు, చాంబర్ ఆఫ్ కామర్సుకు ప్రత్యేక స్థానాలు వున్నాయి. కొందరు ఇంగ్లీషువారు కూడా మెంబర్లుగా వున్నారు. ఇలా ప్రత్యేకంగా వచ్చినవారు అధికంగా కాంగ్రెసేతరులే.

జస్టిస్ పార్టీ బొబ్బిలి రాజా క్రింద అన్ని జిల్లా బోర్డులు, మునిసిపాలిటీలు వాళ్ల చేతుల్లోనే వున్నాయి. అయినా శాసనసభ ఎన్నికలలో ఊహించనంతగా కాంగ్రెస్ విజయం సాధించింది. అదే సమయంలో ఎన్నికలు జరిగిన మరి అయిదు రాష్ట్రాలు బొంబాయి, ఒరిస్సా, బీహార్, ఉత్తర ప్రదేశ్, సెంట్రలే ప్రావిన్సెస్ (నాగపూర్) ప్రాంతాలలో కూడా కాంగ్రెస్ మెజారిటీ సాధించింది. అయితే కాంగ్రెస్ అధిష్టానవర్గం మంత్రివర్గం ఏర్పాటుకు సమ్మతించలేదు. కారణం, చట్ట ప్రకారం మంత్రుల ఆర్డర్లను అమలు పరచకుండా వుండడానికి గవర్నర్లకు అధికారాలుండినవి. అటి అధికారముల క్రింద కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పాటుకు ఇష్ట పడలేదు.

✠ ✠ ✠

అంతకుముందు డైయార్కీగా వున్న పాలనపోయి అన్ని రాష్ట్రాల అధికారాలు మంత్రివర్గాలకు ప్రాప్తమైనాయి. స్థానిక పరిపాలన, వ్యవసాయం, ఆరోగ్యం, దేవాలయాలపై పెత్తనం, ఎక్సైజు మొదలైనవి మంత్రుల చేతులలో వున్నాయి. లా అండ్ ఆర్డర్, రెవిన్యూ, ఎలక్ట్రిసిటీ, ఇరిగేషన్, ఫైనాన్స్ మొదలైన ముఖ్యమైన శాఖలు గవర్నర్ నియమించే ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ చేతుల్లో వున్నాయి. ఆ ద్వంద్వ పరిపాలనా పరిస్థితుల నుంచి 1935వ చట్టం ప్రకారం అన్ని శాఖలపై పెత్తనం మంత్రిలకు ప్రాప్తమైనా, గవర్నర్ల అధికారం స్పష్టంగా కనిపిస్తున్నది. అందువల్ల కాంగ్రెస్ ఆరు రాష్ట్రాల్లో మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయుటకు నిరాకరించినది. 1937 ఏప్రిల్ ఒకటి నుంచి బొబ్బిలి రాజా మంత్రివర్గం రాజీనామా పెట్టి పోయినది. ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్స్



ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ యింకో నాలుగేళ్లకు జన్మిస్తుందనగా 1880 నాటి 'వివేకవర్ధిని'లో: 'అందరూ యూరప్ నుంచి వచ్చే విదేశీ వస్త్రాలకు ఎగబడుతున్నారు - మిల్లువి కాబట్టి చవక. సాలీనా కొన్ని కోట్ల ధనం బయట దేశాలకు ప్రవహిస్తున్నది - పేదలు మరింత పేదలు అవుతున్నారు. ఆ బట్టల మిల్లులు మన దేశంలోనే పెట్టవచ్చు కదా!' అన్నారు....

—కందూకూరి వీరేశలింగం





'దేశాభి మానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్'

—గురజాడ అప్పారావు



పదవీ విరమణ కావించినారు. అధిక సంఖ్యలో గెలిచిన కాంగ్రెస్ నిరాక రించింది.

అట్టి పరిస్థితులలో మద్రాసు రాష్ట్రంలో తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. దానికి సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడు ప్రధాన మంత్రి. ఆయన ఆరుగురితో మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేయగా మిగిలిన అయిదుగురు తమిళనాడు, కేరళవారు. కాంగ్రెస్‌తో బ్రిటిష్ ప్రభుత్వం సంప్రతింపులు ప్రారం భించింది. కడకు గాంధీజీ ఒక రాజీ పథకానికి అంగీకారం తెలిపారు. "మంత్రులను వుంచి వాళ్ల ఉత్తర్వులు అమలుపరచకుండా వుండడం కంటె వారిని డిస్మిస్ చేసి గవర్నర్ల అధికారం చెలాయించవచ్చును. లేదా మంత్రులు వుంటే వారి ఉత్తర్వులను అమలు పరచాలి" అని గాంధీ సూచించారు.

నెహ్రూకు అది సమ్మతంగా కాకున్నా గాంధిజీ సూచించినందున అంగీకారం తెలిపారు. ఈ విధంగా రాజీపడి కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పాటుకు అంగీకరించింది. ఈ లోపల కాంగ్రెస్ పార్టీవారు తమ నాయకులను ఎన్నుకోవల్సి వచ్చింది. మద్రాసు హిందీ ప్రచార సభలో సమావేశం జరిగింది. రాజగోపాలా చారి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ప్రకాశంగారు డిప్యూటి నాయకుడిగా ఎన్నికయ్యారు. నన్నూ ఎన్ను కున్నారు.

ఆనాటి మద్రాసు గవర్నర్ లార్డ్ ఎరోస్‌కిన్. ఆయన ఇంగ్లండ్ నుంచి నేరుగా వచ్చిన గవర్నర్. 1937 జులై 14వ తేదీన రాజాజీ మంత్రివర్గం ఏర్పడినది. పదిమంది మంత్రులలో ఆంధ్ర జిల్లాల నుంచి ప్రకాశంగారు, వి.వి. గిరి. నేను, చిత్తూరు ముస్లింల తరఫున ఎన్నుకో బడిన తెలుగురాని వ్యాపార యాకుబ్ హుస్సేన్ వున్నాం. ప్రకాశంగారు మంత్రి కావడం సహజమైన పరిణామం గిరిగారు బియన్ఆర్ రైల్వే ట్రేడ్ యూనియన్‌లో వున్నారే తప్ప కాంగ్రెస్‌లో సభ్యుడు కాదు. అయితే ఆయన 1922లో ఆరువారాల

పాటు జైలు కెళ్లారు. పైగా ప్రధాన మంత్రిగా వున్న బొబ్బిలిరాజాను ఓడించారు. నాకు అప్పటికి ఇంకా 29 సంవత్సరాలే. రాయలసీమ నుంచి కడప కోటిరెడ్డి వంటి హేమా హేమీలు పలువురు ఎన్నికైవున్నారు. అయితే నేను జిల్లాలో జస్టిస్ పార్టీ ప్రముఖుడు, శాసనసభ ఛైర్మన్ బెజవాడ రామచంద్రారెడ్డిని ఎన్నికలలో ఎదుర్కొని గెలిచాను. నెల్లూరులో నాలుగు స్థానాలు కాంగ్రెస్ కైవసమయ్యాయి. 1937 జులై 14న మౌంటురోడ్డులోని రాజ్‌భవన్ ప్రమాణ స్వీకారం చేసిన మంత్రివర్గం 1939 అక్టోబరు 30 వ తేదీ వరకు, (27 మాసాలకు పైగా) కొనసాగింది. ఆ మంత్రివర్గంలో ప్రకాశంగారు రెవిన్యూ మంత్రిగా, గిరిగారు పరిశ్రమలు, కార్మిక మంత్రిగా, నేను స్థానిక పరిపాలనా మంత్రిగా వ్యవహరించాం. అంతకుముందు 1920 డిసెంబరు నుంచి ప్రధాన మంత్రుల వద్దనే వున్న స్థానిక పరిపాలనా శాఖను నాకు అప్పగించారు.

ఆ దినాలలో మంత్రుల జీతాలు నెలకు 500 రూపాయిలు; ఇంటి బాడుగ 100 రూపాయిలు, మూడు, వేల రూపాయిలకు మించని కారు, దాని ఖర్చుకు 150 రూపాయిలు దినభత్యం రెండున్నర రూపాయిలు డబుల్ థర్డ్ క్లాస్ ప్రయాణాలు. రాజాజి మొదటిసారిగా ప్రతిపాదించిన మొత్తం ప్రభుత్వ బడ్జెట్ 16 కోట్ల రూపాయిలు. అందులో ఏడు కోట్ల రూపాయిలు భూమి శిస్తు నుంచి, నాలుగు కోట్ల రూపాయిలు ఎక్సైజ్ ఆధాయంగా వచ్చేది. విద్యాశాఖపై మూడు కోట్ల రూపాయిలు ఖర్చు చేసేవాళ్లం.

❧ ❧ ❧

రాజాజీ ప్రొహిబిషన్‌ను పెట్టాలని సంకల్పించి, తొలిగా సేలం జిల్లాలో ప్రవేశ పెట్టారు. దీనివల్ల ప్రభుత్వానికి వస్తున్న నాలుగు కోట్ల చిల్లర ఆదాయం పోయే పరిస్థితి ఏర్పడింది. ఆ లోటును భర్తీ చేసుకోవడానికి దేశంలోనే ప్రప్రథమంగా సేల్స్ టాక్స్ (అమ్మకపు పన్ను) విధానాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. అదే ఇప్పుడు అన్ని రాష్ట్రాలలో కామధేనువు ప్రభుత్వానికి ఉపకరిస్తున్నది. దేవదాసీల విధానాన్ని రద్దు చేయడం జరిగింది. వ్యవసాయదారులకు ఋణం తగ్గింపు బిల్లును ప్రవేశపెట్టడం ద్వారా రైతుల ఋణభారం తగ్గించాం. జమిందారీ వ్యవస్థ రద్దుకు ఒక కమిటీని నియమంచగా ప్రకాశంగారు తదితరులు నివేదిక తయారుచేశారు.

బొబ్బిలి రాజాగారు ప్రధాన మంత్రిగా వున్న సమయంలో జిల్లా బోర్డులను రెండుగా చీల్చి కొందరిని నామినేట్ చేయగా, దాన్ని మా హయాంలో రద్దుచేశాం. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య ప్రారంభించిన చీరాల మునిసిపాలిటీ వ్యతిరేక ఉద్యమానికి సంబంధించి, నేను మంత్రి కాగానే ఆ మునిసిపాలిటీ రద్దు

చేశాను. అయితే మేము రాజీనామా వేయగానే వీరాల తిరిగి మునిసిపాలిటీ అయింది.

నాజీ-జర్మనీ పోలెండు పైకి 1939 సెప్టెంబరు ఒకటిన సైన్యాలను పంపించింది. బ్రిటిషు ప్రభుత్వం కూడా జర్మనీపై యుద్ధం ప్రకటించడంతో పాటు, ఇండియాను సంప్రతించకుండానే ఇండియాను యుద్ధంలో భాగస్వాములను చేస్తున్నట్టు ఏకపక్షంగా ప్రకటించింది. ఈ ఏకపక్ష ప్రకటనకు నిరసనగా కాంగ్రెస్ ప్రభుత్వాలు రాజీనామా చేయాలని అక్టోబర్‌లో సమావేశమై తీర్మానించారు. మద్రాసు అసెంబ్లీలో చర్చ జరిగింది. ప్రతి పక్షాలన్నీ ప్రభుత్వం రాజీనామా చేయరాదని బ్రిటిషు వారికి సహకారం అందించాలని డిమాండు చేశాయి. మేము రాజీనామా చేస్తున్నామని ప్రకటించాం.

కాంగ్రెస్ తీర్మానానికి అనుగుణంగా దేశంలో మొదటగా ఈ మద్రాసు ప్రభుత్వమే, రాజీనామా చేసింది. అక్టోబరు 30న మంత్రుల మందరమూ గిండి రాజ్ భవన్‌లో గవర్నర్‌ను కలిసి రాజీనామాలు ఇచ్చాము.

'మీరు పోతున్నందుకు నాకు విచారంగా వుంది. మీ రాజీనామాలు అంగీకరించబడ్డాయి. మీ ఇళ్ళకు వెళ్ళి కార్లు తిరిగి పంపించండి' అని గవర్నర్ అన్నారు. నేను దాని స్వర్ణోత్సవంగా 1989 అక్టోబర్ 30 నాడు మద్రాసు గవర్నర్ పి.సి. అలెగ్జాండర్‌ను కలిసి మా మొదటి క్యాబినెట్ ఫోటో బహూకరించి వచ్చాను. నా పార్లమెంటరీ కార్యదర్శిగా, తర్వాత మద్రాసు ముఖ్యమంత్రి అయిన భక్తవత్సలం కూతురు శ్రీమతి సరోజినీ వరదప్పన్, అన్న కూతురు జయంతి నటరాజన్‌ను కలిసి మాట్లాడి, వారికి కూడా మొదటి క్యాబినెట్ ఫోటోను ఇచ్చాను. మాజీ మంత్రిగా స్వర్ణోత్సవాన్ని వైభవంగా జరుపుకున్నాం....

—'ఆంధ్రజ్యోతి' సౌజన్యంతో

---

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మాఅంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము.... చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004.

మన సైన్య విభాగంలోని

# వీరవనితలు

## విజయ భారతి

మన దేశంలో మొట్ట మొదట మహిళా సైన్య విభాగం 1980లో మొదలైంది. అది ఈనాడు CRPFకి చెంది 88 వ మహిళా సైన్య విభాగంగా రూపొంది అద్భుత ప్రగతిని సాధిస్తోంది.

చట్ట వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొంటూ, మారణాయుధాలను రహస్యంగా చేరవేసే నేరస్తులను పట్టుకోవడం, ప్రకృతి వైపరీత్యాలు, మత కలహాలు సంభవించినపుడు స్త్రీలకు రక్షణ కల్పించడం, ప్రమాదకర ప్రదేశాలలో కాపలా కాయడం వీరి ప్రధాన కార్య కలాపాలు. ఉగ్రవాదంతో మగ్గిపోతున్న జమ్మూ - కాశ్మీర్, అస్సాం, పంజాబ్ వంటి రాష్ట్రాలేకాక విదేశాలలో సైతం ఈ మహిళా సైన్య విభాగం పనిచేస్తోంది. 1988లో ఈ విభాగం శ్రీలంకనుండి 'సేనా మెడలు' యుద్ధ గౌరవ పతకాలను సాధించింది.

అగస్టు 18, 1988 లో ఈ మహిళా సైన్యానికి చెందిన 'ఏ' కాయ్ విభాగం భారత శాంతి పరిరక్షక దళం (IPKF) లో భాగంగా విమానాల ద్వారా శ్రీలంక చేరుకుంది. వెళ్ళిన కొద్ది రోజుల్లోనే ఈ విభాగం సత్ఫలితాలను సాధించింది. లాన్స్ నాయక్ భీమాదేవి సేవా పతకాన్ని గ్రహించిన మొదటి మహిళ.

1198 ప్రేలుడు పదార్థాలను శరీరం చుట్టూ కవచంలా చుట్టుకున్న 'కాదిట ఉమ' అనే యల్. టి. టి. ఇ. ఉగ్రవాద యువతిని ఈమె వాక చక్యంతో బందించగలిగింది.

ఈమె చేసిన ఇంటరాగేషన్ వలన ఎందరినో అరెస్టు చేశారు. అత్యంత ప్రమాదకరమైన పథకం నుండి 'ఎలిఫెంట్ సాస్' ఏరియా రక్షింపబడింది.

☘ ☘ ☘

ప్రస్తుతం మహిళ విభాగం రెండు కంపినీలు శ్రీనగరు, గౌహతి, అయోధ్యలలో విద్రోహ కార్య కలాపాలను అణచడానికి నియమింపబడినాయి. జమ్మూ - కాశ్మీర్, అస్సాంలలో ఉగ్రవాదానికి పాల్పడే పాకిస్తాన్ మిలిటెంట్లతో తరచుగా జరిగే దాడులలో ఆర్మీ, సి. ఆర్. పి. తో కలిసి వీరు పని చేస్తుంటారు. ఈ సాహస వనితలు 11 మంది హిజబుల్ మొజహద్దీన్ మిలిటెంట్లను, 16 ఎ.కె. 47

రైఫిల్స్‌ను, పిస్తోళ్ళు, రివాల్వర్స్‌ను, చేతి పాంబులను, అనేక మారణాయుధాలను స్వాధీనం చేసుకున్నారు.

వీరిలో పధ్నాలుగు మంది విశిష్ట సేవా పతకాలతో ఆరీ చీఫ్ డైరెక్టర్ జనరల్ చేత సత్కరింపబడ్డారు. వీరిలో కొందరు తమ ప్రాణాలెదురొడ్డి వీరోచితంగా పోరాడి అమరులయ్యారు. ఈ విభాగం కూడా ఎన్నో బాంబుదాడులకు, ప్రేలుడు సంఘటనలకు లోనయ్యింది.

మహిళా విభాగపు కమాండర్, ఐ. జి. పి. అయిన అజయరాజ్ శర్మ వీరి విషయం ప్రస్తావిస్తూ, ఊహించిన దానికంటే ఎక్కువగా తమ శక్తియుక్తులను వినియోగిస్తూ గర్వించదగిన స్థాయిలో తమ లక్ష్య సాధనకై పనిచేస్తున్నారని ప్రశంసించారు.

మహిళా తీవ్రవాదులనేగాక అప్పుడప్పుడు వీరు తీవ్రవాద యువకులను కూడా ఎదుర్కొంటుంటారు.

ఈ విభాగంలోని అమ్మాయిలు జూడోలో ఎన్నో జాతీయ బహుమతులను గెలుచుకున్నారని ఐ. జి. పి. చెప్పారు. ఇది అక్షరాల సత్యం. వీరి యుద్ధ నైపుణ్యం ప్రశంసించదగినదే కాక దేశవ్యాప్తంగా వీరి అవసరం పెరిగింది.

☘ ☘ ☘

ఈ రోజు మహిళా విభాగం సంఖ్య అధికం చేయడం అత్యంతావశ్యకం. దీనికి తగిన ప్రయత్నాలు కూడా జరుగుతున్నాయి. మహిళా కానిస్టేబుల్స్‌ని అధిక శాతం పెంచే ప్రయత్నం జరుగుతున్నది.

స్వభావసిద్ధంగా ఈ అమ్మాయిలు ఎవరితో పోటీ పడటానికైనా వెనుకాడరు. ధైర్య సాహసాలకు పేరు మారు పేరు కుమారి అమృతాబ్రార్ అసిస్టెంటు కమాండెంట్‌గా మహిళా విభాగంలో నియమితులయ్యారు. అయితే ఈమె పురుషులతో దీటుగా CRPF బెటాలియన్‌లో పనిచేయాలని ఉత్సాహపడుతుంది. శ్రీనగర్‌లోని ప్రత్యేక కమాండ్ టీము కమాండర్ అయిన బ్రార్ తనకిచ్చిన బుల్లెట్ ప్రూఫ్ (తుపాకీ గుళ్ళ నుండి రక్షించుకొనే రక్షణ కవచం)ని తిరస్కరించింది. తన టీమ్‌లోని మిగతా వారందరికి ఇదేవిధంగా రక్షణ కవచం లేనప్పుడు తన కనవసరమనేది ఆ తిరస్కారానికి కారణం. స్త్రీలలోని ధైర్య సాహసాలకు ఇంతకంటే గొప్ప తార్కాణ మేముంటుంది ?

ఈ విభాగానికి యువతులే ముఖ్యం. ఇందులో క్లర్కులు, ఆసుపత్రి స్టాఫ్ అంతా కలిసి 1,151 మంది ఉన్నారు. 276 మంది వివాహితలు, 168 మంది తల్లులు ఉన్నారు సరాసరిగా తీసుకొంటే ఎప్పుడూ 55 మంది వరకు కాన్పులకై సెలవు తీసుకొంటూ ఉంటారు. ప్రతి సంవత్సరం 35 నుండి 40 మంది అమ్మాయిలు వివాహ నిమిత్తం విడువలై పోతుంటారు.

☘ ☘ ☘

కొన్ని ముఖ్యమైన చర్యలు చేపట్టి నట్లయితే యువతీ శక్తిని ఇంకా ఎక్కువ స్థాయిలో ఉపయోగించ వచ్చును. 17 నుండి 21 సంవత్స రాల మధ్య వయసు వారిని అధిక సంఖ్యలో నియమించాలి. 15 సంవత్స రముల తరువాత తాము కోరుకుంటే స్వచ్ఛందంగా పదవీ విరమణ చేసే అవకాశం కల్పించాలి.

మహిళా సైన్య విభాగంలోని స్త్రీలు వ్యక్తిగతంగా కొన్ని సమస్యల నెదు ర్కొనవలసి వస్తుంది. కుటుంబాలు ఉండడానికి వసతి లేక పోవడం, ఉద్యోగ నిర్వహణలో అటూ ఇటూ బదలీ అవుతూ ఉండడం వీరికి సమస్యలుగా పరిణమిస్తున్నాయి. అయినా కూడా తమ విధినిర్వహణలో ఈ సమస్యలన్నిటినీ అధిగమిస్తున్నారు.

ఎన్ని ఇబ్బందులెదురైనా వీరి ఆత్మ విశ్వాసం సాటిలేనిది. వీరి దృఢ సంకల్పం ఎన్నటికీ చెరిగిపోనిది.

—'జాగృతి' సౌజన్యంతో

---

శత్రువు బాణాన్ని ఎదుర్కోవడం సులభం ; కాని, స్నేహితుని కత్తిపోటు తప్పించుకోవటం కష్టం. అలాగే బాధల నుంచి బయటపడటం తేలిక ; సంపదల వూబి నుంచి వెలికిరావటం కష్టం. — చైనీయ సూక్తి

---

# 'జగతి' చందా కూపను

2, కచేరి రోడ్డు - పి.బి. 2922
మైలాపూరు - మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ..............................................

అడ్రసు ..............................................

..............................................

..............................................

తేదీ :

సంతకం



?

"I am told Ravana entered the battle-front only after the death of Prahasta..." said Raghu.

"You are correct, my boy. Prahasta was Ravana's maternal uncle and a sort of Minister-in-Chief. His deputies were Narantaka, Samunnata, Mahanatha and Kumbha Hanu - not Kumbha Karna, the brother of Ravana," said Raghu's Father.

"Anyway, Dad, those deputy ministers had very interesting names. So, Prahasta was on the scene accompanied by the four subordinates. Poor fellows, did they survive him?" was Raghu's question.

"How could they? The guards should be eliminated before attacking the chief. Vanaras were a skilful lot. All the four were slain one after the other and Prahasta had to face the Vanara Commander Neelu, a mighty warrior of immense strength. When he destroyed the chariot, Prahasta was forced to jump out of it and challenge the enemy to wrestling. Neelu was so powerful that he brought Prahasta to ground and battered his head ruthlessly. When Ravana heard of this gruesome killing, he thought it was time to come out into the open and settle scores with Rama," explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha* *(Director : BVSS Mani)*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*





మన యింట్లో సుఖశాంతులు లేకపోతే, లోకంలోనూ వుండవు.... త్యాగనిరతి నుంచి ప్రేమ ప్రసూనం జనిస్తుంది.... ఆకలి అనేది తిండి ఒక్క దానికోసమే కాదు ; అనురాగం కోసం, సానుభూతి కోసం, ఆదరణ కోసం ఆకలి .... జీవితం బతికేందుకు, బాట నడిచేందుకు, దీపం వెలిగించేందుకు, ప్రేమ అర్పించేందుకు, సంతోషం యిచ్చేందుకు' - అంటున్నారు ...

—మదర్ థెరిసా



కృష్ణాజిల్లా పెనుగంచి ప్రోలులో 1876లో జన్మించి, సంస్కృతం, ఇంగ్లీషు, తెలుగు, మరాటీ, హిందీ, గుజరాతీ, బెంగాలీ, కన్నడం, తమిళం నేర్చుకు, మునగాలలో సంస్థానానికి దివాన్లై, హైదరాబాదులో 'శ్రీ కృష్ణ దేవరాయ ఆంధ్ర భాషా నిలయం', మద్రాసులో 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' స్థాపించిన, తెలుగు 'రినైసాన్స్' ప్రముఖులు...

—కొమర్రాజు లక్ష్మణరావు

# ఈమని వీణ ఆమని

## పాలగుమ్మి విశ్వనాథం

డిసెంబరు 22, 1987 రాత్రి, నిశ్శబ్ద నిశీధిని చీల్చుకుంటూ, సర్కార్ ఎక్స్‌ప్రెస్ మద్రాసు చేరుకోవడానికి పరుగులు తీస్తోంది. ఈ లోకంతో తన పని తీరిపోయినట్టు ఒక మహత్తర జీవితం ఆఖరి మజిలీ రాత్రి 12 గంటలు, ఉదయం 5 గంటల మధ్య ఎప్పుడో ఆ వీణ గళం మూగవోయింది. ఆ మౌనరాత్రిలో విశ్వ వీణ తంత్రులపై మూర్ఛనలు హఠాత్తుగా నిలిచి పోయాయి. తెల్లవారేసరికి ఈమని శంకరశాస్త్రిగారి భౌతిక కాయం మాత్రం మద్రాసు చేరుకుంది సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో. పై బెర్తులో పడుకున్న కుమారుని కైనా ఒక్క మాట చెప్పకుండా, అసంఖ్యాకంగా పెంచుకున్న ఆప్తులు అభిమానులకు ఆఖరి చూపు అయినా దక్కకుండా శంకరశాస్త్రి అవతారం చాలించుకున్నారు. అనాయాస మరణం ఎంత అదృష్టం.

కళాకారుడిగా ఆయనకు రావలసిన గౌరవాలన్నీ ఎప్పుడో వచ్చేశాయి. ఇంకా జరగవలసినవి ఒకటి రెండు మిగిలిపోయాయా అన్నట్లు, కొద్దిరోజులకి ముందే ఆ శాంత సౌజన్యమూర్తి ని, ఒక దృశ్య చిత్రంలోనైనా బంధించి ఉంచకపోతే, మనకు ఆయన దక్కడేమో అన్నట్టు, హైదరాబాదు దూరదర్శన్ బృందం యమునా సంజీవి, పార్వతీశం - తమ సరంజామాతో వచ్చి, మూడు నాలుగు రోజులు ఎంతో శ్రమపడి శంకరశాస్త్రిగారి మీద ఒక డాక్యుమెంటరీ తయారుచేశారు. తర్వాత గుంటూరులో నాగార్జున కల్చరల్ సంస్థవారు, ఆయనకు కనకాభిషేకం చేశారు. ఆ కనకాభిషేకం రుణం తీర్చేసేందుకా అన్నట్టు ఆ మరునాడు, నరసరావుపేటలో అద్భుతమైన చివరి కచేరీ! ఆ కచేరీకి ఎన్నుకున్న కీర్తనలు - కళ్యాణ వసంత రాగంలో నాదలోలుడై బ్రహ్మానంద మందవే మనసా, సురటి రాగంలో గీతార్థము, సంగీతానందము, సారమతి రాగంలో మోక్షము గలదా మొదలైనవి శాస్త్రిగారు ఇరవై సంవత్సరాలు వెనక్కు వెళ్ళిపోయి యవ్వనంలో వాయిస్తున్నట్టు ఉంది ఇవ్వాళ - అన్నారు ఆనాటి కచ్చేరి విన్న శ్రోతలు తన్మయత్వంలో.

కీర్తి శిఖరాలలో శంకరశాస్త్రిగారు చేరుకున్న ఆఖరి మెట్టు అది.

మర్నాడు ఆయన అధిరోహించినది కైలాసగిరియే.

* * *

అసలైన నాదానుభవం వాద్య సంగీతంలోనే లభ్యం అవుతుందని (ఆ స్థాయిని అందుకున్న అపురూప గాత్రాలూ ఉన్నాయి. అది వేరే విషయం). అంటే, 'మాట' సహాయం లేకుండా, కేవలం నాదం ద్వారానే రసానుభూతి కలిగించే లక్షణం వాద్య సంగీతానికి ఎక్కువగా ఉంది. నాదసర్వ వాయిద్యం పేరు చెప్పగానే, తిరువాడుదొరై రాజరత్నం పిళ్ళై, వేణువు పేరు చెప్పగానే టి. ఆర్. మహాలింగం, వయోలిన్ అంటే ద్వారం వెంకటస్వామినాయుడు, వీణ అనగానే ఈమని శంకరశాస్త్రి ఇల్లా ఒక్కొక్క వాయిద్యంలో ఒక్కొకరు మన కళ్ళ ఎదుట కనిపిస్తారు. ఆయా కళాకారుల చేతుల్లో ఆ వాయిద్యాలు, కొత్త పుంతలు తొక్కి కొత్త అందాలు విరజిమ్మాయి.

నాద సముద్రంలో కొత్త తీరాలను అన్వేషిస్తూ పోయిన నావికుడు శంకర శాస్త్రి. నలుగురు నడిచిన దారుల్లో ఒకరి అడుగు జాడల్లో, వెనకాలే నడిచే స్వభావం కాదు ఆయనది. ఆయన చేతుల్లో వీణావాదన, కొత్త పుంతలు తొక్కింది. అంతవరకు ఆ వాయిద్యం తో బందీలై పోయిన దివ్య నాదాలు, ఆయన స్పర్శతో బంధ విముక్తలై తీరుతెన్నులే, మారిపోయి ప్రత్యేక శైలిగా 'ఈమని బాణీ'గా నిలిచి పోయాయి.

వీణ నాజూకైన వాయిద్యం. దాని ధ్వని సౌందర్యాలు, దగ్గరనుంచి వింటేనే గాని, వినిపించవు. ఆయన క్రితం తరం దాకా, వీణ కచేరీలు రాజ ప్రాసాదంలోను, ప్రత్యేక మంది రాల్లోనూ, కొద్ది మంది శ్రోతల సమక్షంలోనే జరుగుతుండేవి.

జన బాహుళ్యంలోకి, వీణని పట్టుకొచ్చిన ఘనత శంకరశాస్త్రి గారిదే! వీణలో వినిపించే సూక్ష్మమైన ధ్వని విశేషాలు అందరికీ వినిపించేలా, కాంటాక్ట్ మైక్‌ను సమర్థవంతంగా ఉపయోగించి, వీణా వాయిద్యానికి బహుళ ప్రచారం తెచ్చినది ఆయనే.

* * *

తూర్పు గోదావరి జిల్లాలోని మారుమూల గ్రామం ద్రాక్షారామంలో పుట్టి, దక్షిణ భారతంలో మొదట ధ్వజం నాటి, తర్వాత క్రమేణా యావత్ భారతంలో, ఖండాంతరాలలో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న ఆ కళా కోవిదుడి కళా సృష్టికి పునాదులు, ప్రేరణలు, జీవిత విశేషాలు పరిశీలనార్హం.

శంకరశాస్త్రిగారిది సంగీత కుటుంబం. తండ్రి అచ్యుతరామశాస్త్రి గారు, తాత సుబ్బారాయ శాస్త్రిగారు వీణ విద్వాంసులు. వారిది బొబ్బిలి సంప్రదాయం. సెప్టెంబరు 23న 1920 లో శంకరశాస్త్రి జననం. నాలుగో ఏట నుంచి సంగీతంలో ప్రజ్ఞా పాటవాలు కనిపిస్తుండేవి. ఎనిమిదేళ్ళ వయసులో తండ్రిగారు వీణ వాయిస్తుంటే, పక్కన కూర్చుని పోటీతో

మృదంగ శబ్దాలు (కొనగోట) చెబుతుండేవాడు ఈయన. గాత్రంకూడ పాడేవాడు. ఆ రోజుల్లో కాకినాడ ప్రజలకి, అక్కడ జరిగే దసరా గాన సభలు పెద్ద పండుగ. కీ. శే. కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడు గారి ఆధ్వర్యంలో, సరస్వతీ గానసభ అతివైభవంగా పది రోజుల పాటు దసరా సంగీతోత్సవాలు జరిపేది. దక్షిణాది నుంచి పెద్ద పెద్ద సంగీత విద్వాంసులు వచ్చి అక్కడ పాడుతుండేవారు. సరస్వతీ గానసభ, మద్రాసు మ్యూజిక్ ఎకాడమీకి ముందు నుంచి ఉంది.

శంకరశాస్త్రిగారి పెద్ద అక్క సత్యవతమ్మగారు, తమ్ముణ్ణి తీసుకుని ప్రతి సంవత్సరం, ద్రాక్షారం నుంచి కాకినాడ వచ్చేవారు సంగీత కచేరీలు వినడానికి. కాకినాడ వాతావరణం ఈయనకి నచ్చింది. అక్కడే ఉండిపోయి చదువుకోవాలనిపించింది. చిన్నతనం నుంచీ ఈయనకు ధైర్యం ఎక్కువ. సరాసరి పి. ఆర్. కాలేజీ ప్రిన్సిపాల్ పెద్దాడ రామస్వామి గారిని కలిసారు. ఈ కాలేజీకి చేరి హైస్కూలు కూడా ఉండేది. రామస్వామిగారు ఈ బాలుడి చొరవ చూసి సంతోషిస్తూ, సీటు ఇచ్చారు. శంకరశాస్త్రి అసలు పేరు శంకర సూర్య మాణిక్యాలరావు, రామస్వామిగారు "ఇంత పొడుగు పేరేమిటోయ్: పైగా మీ తండ్రి శాస్త్రి, మీ తాత శాస్త్రి. నీకు ఈ 'రావు' ఎందుకు? ఇవాల్టి నుంచి నువ్వు శంకరశాస్త్రి" అన్నారు. అప్పటినుంచి ఆయన శంకరశాస్త్రి అయిపోయారు.

తీరా స్కూల్లో చేరాక చదువుకి అంతరాయం వచ్చింది. 'అపెండిసైటిస్' ఆపరేషన్ అయి ఒక సంవత్సరం ఇంట్లో ఉండవలసి వచ్చింది. అప్పుడు ఆయనకి వీణ మీద కుతూహలం పుట్టింది. కుమారుడి ఉత్సాహం చూసి, అచ్యుతరామశాస్త్రిగారు వీణ మొదలుపెట్టి, చెప్పడం ఆరంభించారు. కాని అట్టేకాలం సాగలేదు.

అచ్యుతరామ శాస్త్రిగారి తరహా వేరు. ఆయన చండశాసనుడు, వీణ ఆయనకు ఆరాధ్య దేవత. సంప్రదాయ సంగీత కుటుంబాలలో ఉండే నిష్ఠ, నియమాలు ఆయనలో మూర్తీభవించి ఉండేవి. వీణకి తీగలు వెయ్యడం దగ్గరనుంచీ ఒక పద్ధతిగా ఉండేది. నిత్య దేవతారాధనలాగ వీణ సాధన ఆయన దినచర్యలో ప్రధాన భాగం. విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు, పడుకున్నప్పుడు కూడా వీణ ప్రక్కనే ఉండేది మధ్యలో మెలకువ వస్తే పడుకునే, గుండెమీద అడ్డంగా పెట్టుకుని వాయిస్తుండేవారు. అంత సాధకం చేసిన వైణికుడాయన. మంచి శిక్షణతో ఆయన వీణ నేర్చుకున్నారు. అలాగే తన కొడుకు కూడా నేర్చుకోవాలి. అదీ ఆయన ధోరణి. వంచిన తల ఎత్తకుండా, సరళీ స్వరం అల్లా వాయిస్తూ ఉండవలసిందే. మరి శంకరశాస్త్రిగారిది పాదరసంలా పరుగెత్తే బుద్ధి. ఎక్కడో విన్న రాగం వాయిస్తుండేవాడు. దాంతో వీపు చెక్క

మనేది. తంత్రిడిదగ్గర నేర్చుకోవడం స్వస్తిచెప్పారు. కాని వీణ మీద ఉత్సాహం తగ్గలేదు. సరస్వతీ గాన సభలో ఆయన విన్న ద్వారం వెంకట స్వామి నాయుడుగారూ, అరియకుడి రామానుజయ్యంగార్, సెమ్మంగుడి శ్రీనివాసయ్యర్, రాజరత్నం పిళ్ళై మొదలైన ఎంతోమంది సంగీత విద్వాంసుల సంగీతం, లేత హృదయాన్ని సస్యశ్యామలం చేసింది. సెమ్మంగుడి పాటలో నాద ప్రవాహం ఎడతెగని, ఏక ధారగా పొంగిన నాద సముద్రంలా, రసిక హృదయాలను ముంచెత్తేసేది. సెమ్మంగుడి ఎల్లా పాడితే, అల్లాగ వీణలో పలికించడమే ఆయన ధ్యేయం ఆరోజుల్లో.

శంకరశాస్త్రిగారిలో ఇంకో ప్రజ్ఞ ఉంది. ఆయనకు నచ్చిన సంగీతం ఒకసారి వింటే చాలు. అది ఆయన సొంతం అయిపోయేది. సెమ్మంగుడి పాడినట్టే ఆయన పాడేవాడు. పాడినట్టు వీణ మీద పలకాలి. పలికిందాకా నిరంతర తపన. రకరకాల ప్రయోగాలు, రకరకాల మీట్లు, ఆ వీణ మీద కట్టేసిన ఉక్కు తీగ, దాని సహజ లక్షణం మరచిపోయి గాత్రంలా పలకడం ఆరంభించింది. ఆ రోజుల్లో ఆయన చేతుల్లో వీణ గజ గజ ఊగిపోయేది. వీణతోపాటు ఆయన మెలికలు తిరిగిపోయేవాడు. హావ భావాలు విపరీతంగా ఉండేవి. వంచిన తల ఎత్తడం ఉండేదికాదు. ఈయన కూడా పొట్టిగా, ఇంచుమించు వీణ సైజులోనే ఉండేవాడు. వీణ, శంకరశాస్త్రి ఒకరిలో ఒకరు కలసిపోయి సృష్టించిన ఆ నాద సౌందర్యానికి ఆనాడు పండిత పామరులిద్దరూ సమంగా తలలూపేవారు.

ఆనాటి శంకరశాస్త్రి వీణలో నాద పోషణకి మీటు ఎక్కడ పడేదో తెలిసేదికాదు. ఎడతెగని నాద ప్రవాహంలో, రాగభావం మీగడ తరగల్లా తేలిపోతూ ఉండేది. శాస్త్రీయ సంగీతంలో ఉండవలసిన గాంభీర్యం, వైశాల్యంతో పాటు అందచందాలు జోడించిన అపూర్వ నాద సృష్టి; ప్రతిభా వ్యుత్పత్తు సమపాళ్ళలో ప్రదర్శించటం వల్ల, ఆ చిన్న వయస్సులోనే సంగీత ప్రపంచంలో ప్రముఖస్థానం సంపాదించుకున్నాడాయన.

✠ ✠ ✠

కాకినాడకి దగ్గరలోనే ఉన్న పిఠాపురానికి ఒక ప్రసిద్ధ చరిత్ర ఉంది. ఆ సంస్థానంలో సంగీత సాహిత్యాలకు ఆదరాభిమానాలు ఎక్కువగా ఉండేవి. తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారు అక్కడ ఆస్థాన వీణ విద్వాంసులు. ఆయన వీణ వాయిద్యం గురించి కథలు కథలుగా చెప్పుకొనేవారు. అప్పుడే ఆయన స్వర్గస్థులైనారు. ఒక సందర్భంలో పిఠాపురం ఆస్థానంలో అచ్యుతరామ శాస్త్రిగారి వీణ కచేరీ ఏర్పాటయింది. ఏ కారణం వల్లనో అచ్యుతరామశాస్త్రిగారికి వెళ్ళడానికి వీలులేక కుమారుణ్ణి పంపించారు.

సంగన్నగారి వీణ విన్న పిఠాపురం వాస్తవ్యులకి, ఇంక ఏ సంగీతం ఎక్కేది కాదు. "ఏదో కుర్రాడు వాయిస్తున్నాడు విందాం" అని వెళ్ళిన పెద్దలకి శంకరశాస్త్రి వాద్యం విన్న తరువాత అభిప్రాయం మారింది. అక్కడ ఆయనకి అభిమానులు ఏర్పడారు. పిఠాపురం శ్రోతల్ని మెప్పించడమే ఆయన ధ్యేయంగా ఉండేది. ఆ రోజుల్లో తరచు పిఠాపురం వెళ్ళి వాయిస్తూండేవారాయన.

ఆ రోజుల్లో రేడియోలు, గ్రామఫోనులు ఏ కొద్దిమంది ఇళ్ళల్లోనో ఉండేవి. కాకినాడలో కొమ్మిరెడ్డి సూర్య నారాయణమూర్తి నాయుడు గారు, శంకరశాస్త్రిని చేరదీసి ఆదరించేవారు. నాయుడిగారి ఇంట్లో గ్రామఫోను రికార్డులు, రేడియో వినడానికి తరచు వెడుతుండేవారు శంకరశాస్త్రి. ప్రముఖ సంగీత విద్వాంసులు మునగంటి వెంకట్రావుగారి దగ్గర హిందుస్థానీ సంగీతం రికార్డులుండేవి. అక్కడ హిందుస్థానీ సంగీతం వినేవారు. (కొద్దికాలం మునుగంటి వెంకట్రావుగారి వద్ద సంగీతం నేర్చుకున్నారు). కాకినాడలోనే ఎమ్.వి. శాస్త్రి అనే గొప్ప వ్యక్తి ఉండేవాడు. ఆయన దగ్గర అన్ని సంగీతాలతో పాటు పాశ్చాత్య సంగీతం రికార్డులు కూడా ఉండేవి. అక్కడ పాశ్చాత్య సంగీతం వినడం తటస్థపడేది.

ప్రధానంగా కర్ణాటక సంగీత సాంప్రదాయాన్నే అనుసరిస్తున్నా, ఇతర సంగీతాల ప్రభావం శంకరశాస్త్రిగారి మనో ధర్మానికి వైశాల్యం కల్పించి, ఆయన కల్పనా చాతుర్యానికి పదును పెట్టింది.

కాలేజీ చదువులో అప్పటికి ఇంటర్మీడియట్ పూర్తి అయింది. కాంగ్రెస్ మొదటిసారిగా ప్రభుత్వం

చేపట్టింది. మద్రాసులో మొదటి స్పీకర్ బులుసు సాంబమూర్తిగారు. సాంబమూర్తిగారు అచ్యుతశాస్త్రిగారి అభిమాని. "మీలాంటి విద్వాంసుడు మద్రాసులో ఉండాలి" అని అచ్యుత రామశాస్త్రిగారి కుటుంబం మద్రాసు మార్పించివేశారు.

❀ ❀ ❀

ఎస్.ఎస్. వాసన్‌గారు జెమినీ స్టూడియో స్థాపించిన మొదటి రోజులు. సంగీత దర్శకులుగా తమిళ విభాగానికి సంగీత భూషణ ఎమ్.డి. పార్థసారథి, తెలుగు విభాగానికి ఎస్. రాజేశ్వరరావు ఉండేవారు. అప్పటికే శంకరశాస్త్రిగారు తిరువయ్యార్‌లో త్యాగరాజస్వామి ఆరాధన ఉత్సవాలలో వాయించడం, తిరుచురాపల్లి రేడియోలో గంట వీణ కచేరీ వాయించడం, దక్షిణాదినీ, మద్రాసులోనూ కచేరీలు చేయడం జరిగింది. యువకుడైన శంకరశాస్త్రికి జెమినీ స్టూడియోలో చేరాలని కోరిక గలిగింది. అక్కడ సంగీత దర్శకుడుగా ఉన్న ఎమ్.డి. పార్థసారథి, వాసన్‌గారు శంకరశాస్త్రిగారి వీణ వినడానికి ఏర్పాటు చేశారు. ఆవేళ అక్కడ ఉన్నది పాపనాశనం శివన్ అనే గొప్ప వాగ్గేయకారుడు, దండపాణి దేశిగర్, కొత్త మంగళం ను (సంగీత విద్వాంసుడు), కొత్త మంగళం సుబ్బు (రచయిత), రాజేశ్వర్‌రావు మొదలైన హేమా హేమీలంతా ఉన్నారు. ఆనాడు శంకరశాస్త్రిగారు ప్రధానంగా వాయించినది గౌరీ మనోహరి రాగం తానం పల్లవి.

అంతా ముగ్ధులై వున్నారు. వెంటనే వాసన్‌గారు శంకరశాస్త్రిగారిని జెమినీలో చేరిపొమ్మనడం, ఆయన ఒప్పేసుకుని చేరిపోవడం జరిగింది. ఇంట్లో ఎవరికీ చెప్పలేదు. ఇంట్లో గొడవ బయలుదేరింది. తండ్రిగారికి సినిమాల్లో చేరడం ఇష్టంలేదు. ఇంకా చదువులో బి.ఏ. పూర్తికాలేదు. కాని ఇంట్లో వాళ్ళని ఒప్పించి శాస్త్రిగారు జెమినీ స్టూడియో ప్రాంగణంలో అడుగు పెట్టడంతో, ఆయన జీవితంలో కొత్త అధ్యాయం ప్రారంభం అయింది. అప్పటికి ఆయన వయస్సు 19 సంవత్సరాలు. జెమినీలో పెద్ద వాద్య బృందం ఉండేది. అందులో వీణ కళాకారుడుగా ఆయన పని.

అలా రెండు మూడు సంవత్సరాలు పనిచేశాక, శాస్త్రిగారికి తిరిగి కాలేజీలో జేరి బి.ఎ. పూర్తిచేయాలని సంకల్పం కలిగింది. వాసన్ గారు ఉదారుడు. "నువ్వు ఎప్పుడొచ్చినా నీ స్థానం నీ కోసం అల్లాగే ఉంటుంది. సెలవుల్లో వచ్చి పనిచేస్తూ ఉండు" అని ప్రోత్సహించారు. కాకినాడ వచ్చి బి.ఎ. పూర్తిచేశారు. అప్పుడే వివాహం కూడా జరిగింది. తిరిగి 1945లో శాస్త్రిగారు జెమినీలో ప్రవేశించారు. కాని వైణికుడిగానే ఉండిపోవడం ఆయనకు ఇష్టంలేదు. సంగీత దర్శకత్వం మీదికి పోయింది ఆయన మనసు. తిన్నగా వాసన్‌గారి దగరకు వెళ్ళి, తాను ట్యూన్స్ కంపోజ్

చేస్తానని చెప్పారు. ఆయన 'సరే' అన్నాడు. అప్పటికే ఇద్దరు సంగీత దర్శకులు ఉన్నారు. ఈయన కూడా రంగంలోకి వచ్చేసరికి సంగీత దర్శకులలో పోటీలు ఆరంభం అయ్యాయి.

జెమినీలో ఓ పద్ధతి ఉండేది. ఒకే సన్నివేశానికి ఇద్దరు, ముగ్గురు సంగీత దర్శకులు ట్యూన్స్ కంపోజ్ చేసేవారు. ఇవన్నీ వాసన్‌గారు, చుట్టూ ఉండే పరివారం అంతా కలిసి వినేవారు. అప్పుడు దానిమీద చర్చలు ప్రారంభం అయ్యేవి.

శంకరశాస్త్రి గారికి తన ప్రతిభ మీద నమ్మకం. మిగతా లౌకికం ఆయనకు తెలియదు. పోటీలకు తట్టుకునే ఆయన హిందీచిత్రాలు, మంగళ, సంసార్, బహుత్ దిన్ హువే, నిషాన్, మిస్టర్ సంపత్. చంద్రలేఖ మొదలైన చిత్రాలలో చాలా పాటలకు సంగీత దర్శకత్వం వహించారు. చాలా జెమినీ చిత్రాలకు ఆయన నేపథ్య సంగీతం నిర్వహించారు.

❀ ❀ ❀

సుమారు 15 సంవత్సరాలు జెమినీలో పనిచేసిన తర్వాత సినిమా ప్రపంచం నుంచి తప్పుకున్నారు శాస్త్రిగారు. డాక్టరు కేస్‌కర్ ప్రసార మంత్రిగా ఉన్నప్పుడు, దేశంలో ప్రముఖ రచయితలనీ, కవులనీ, సంగీత విద్వాంసులనీ, ఆకాశవాణి సంస్థలో జేరి ఆకాశవాణి కార్యక్రమాల స్థాయి పెంచవలసిందిగా ఆహ్వానించారు. 1959లో ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో ప్రొడ్యూసర్‌గా ప్రవేశించారు శాస్త్రిగారు. రెండేళ్ళ తర్వాత ఆకాశవాణి వాద్య బృంద డైరెక్టరుగా ఢిల్లీ కేంద్రానికి వెళ్ళారు. అప్పటి నుంచి చివరిదాకా ఉజ్వలమైన దశ నడిచింది. తర్వాత కొద్దికాలానికి కర్ణాటక సంగీతానికి చీఫ్ ప్రొడ్యూసర్ పదవి కూడా చేపట్టారు.

ఉద్యోగరీత్యా దేశంలోని ఆకాశవాణి కేంద్రాలన్నీ సందర్శించడం, దేశంలోని ప్రముఖ విద్వాంసులతో పరిచయాలు, స్నేహాలు, దేశం నలుమూలలా కచేరీలు చేయటం, ఆకాశవాణి ఢిల్లీ కేంద్రంలో ఉన్నప్పుడే, అనేక సత్కారాలు, సన్మానాలు, బిరుదు ప్రదానాలు జరిగాయి. భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదుతో ఆయన్ను సత్కరించింది. గాంధర్వ మహావిద్యాలయ 'మహా మహోపాధ్యాయ' బిరుదుతో గౌరవించించింది. ఇంకా సంగీత నాటక ఎకాడమీ ఫెలోషిప్, ఆంధ్ర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ ప్రదానం – ఇలా ఎన్నెన్నో జరిగాయి. 1973లో జస్టిస్ వి.అర్. కృష్ణయ్యర్ అధ్యక్షతన ఢిల్లీ పౌరులు శంకరశాస్త్రిగారికి ఘన సన్మానం చేసి 50 వేల రూపాయల పర్సు బహూకరించారు.

శాస్త్రిగారి ప్రతిభా సంపత్తికి తగిన సంస్థ ఆకాశవాణి. ఆ సంస్థకు సర్వతోముఖమైన సేవలు అందించిన కళాకారుడాయన. ఒక ప్రక్క సంగీతంలో ఏ ప్రయోగాలు చేయ

దలవినా ఆకాశవాణి వాద్య బృందం ఉండేది. మరో ప్రక్క అసమాన మైన వైణికుడిగా, ఆయన వీణా గానాన్ని ఇంటింటా వినిపింప జేసే సౌలభ్యం ఉంది. రాజధానీ నగరంలో, ఆకాశవాణిలో ప్రధాన స్థానంలో ఉండడం వల్ల విదేశాల నుంచి వచ్చే ప్రముఖ విద్వాంసులతో పరిచయాలు, రాజధానిలో జరిగే ముఖ్యమైన సందర్భాల్లో ఆయన ప్రతిభ ప్రదర్శించే అవకాశాలు వాటం తట అవే వచ్చాయి. శాస్త్రిగారు రష్యా, యూరప్, అమెరికా దేశాలు దర్శించి ఎన్నో వీణ కచేరీలు చేశారు. పారిస్ నగరంలో మోహూది మెనూహిచ్ రాష్ట్రా పోలిచ్ మొదలైన ప్రముఖ సంగీత విద్వాంసుల సమక్షంలో ఆయన కచేరీ చరిత్ర సృష్టించింది. 'శతాబ్దికి ఓసారి లభ్యమయే సంగీతం' (The Concert of the Century) అని పారిస్ పత్రికలు ప్రశంసించాయి. అమెరికాలో 'మెమ్‌సిన్' నగర మేయర్ శాస్త్రిగారికి గౌరవ సూచ కంగా ఆ 'నగర తాళం' బహూక రించారు.

యునైటెడ్ నేషన్స్‌లో శాస్త్రిగారిని వీణ వాయించడానికి ఆహ్వానించారు. ఆయన కచేరీ చివర శాంతి మంత్రం వాయించి 'ఓం శాంతిః ఓం శాంతిః' అని వీణ కింద పెట్టిన మరుక్షణం ఒక వార్త వచ్చింది. అంతవరకు జరుగుతున్న అరబ్-ఇజ్రాయిల్ యుద్ధం ఆగిపోయిందని. అప్పుడు అన్ని దేశాల ప్రతినిధులు 'శాంతి దూత' (The Messenger of Peace) అని శాస్త్రిగారిని శ్లాఘించారు.

నిత్య జీవితంలో చుట్టూ జరిగే సంఘటనలకు సంబంధం లేకుండా, దూరంగా ఉండేవాడు కళాకారుడు. ఏదో ఒక సంఘటనకు స్పందించి, ఉత్తేజితుడైతే ఆ అనుభవాన్ని కళా కారుడు తన కళాసృష్టిలో వ్యక్తం చేయగలగాలి. అది సాహిత్యంలోనూ, చిత్ర కళలోనూ జరుగుతోంది. అలాంటి కళాసృష్టిని సంగీతంలో చేసిన మొదటి కళాకారుడు శంకర శాస్త్రి.

అపుడు ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. ఆంధ్ర రాష్ట్రం కోసం ఎందరెందరో ఎన్నో కష్టాలు పడ్డారు. ఎన్నో త్యాగాలు చేశారు. కొందరు ప్రాణాలు కూడా కోల్పోయారు. చివరకు తమ ఆశయం సాధించారు. అదే సమ యంలో టెన్సింగ్ నార్కే ఎవరెస్టు శిఖరం అధిరోహించాడు. ఆ శిఖరాన్ని చేరుకోవడానికి ప్రకృతితో అడు గడుక్కీ పోరాటం, చివరికి అన్ని అవరోధాలు దాటి శిఖరాన్ని చేరుకోవడం. ఈ రెంటినీ పోలుస్తూ 'ఆదర్శ శిఖరారోహణం' అనే వాద్య చిత్రాన్ని రూపొందించారు శాస్త్రిగారు. ఇది ఆయన మొదటి వాద్య చిత్రం అందులో నాలుగు వీణలు మాత్రమే ఉపయోగించారు. ఆ రచన ఎన్నో మన్ననల నందుకుంది. తర్వాత అనేక ఇతివృత్తాలు తీసుకుని సృష్టిం

చిన స్వర చిత్రాలు సుమారు ఎనభై దాకా ఉంటాయి. ఈ స్వర చిత్రాలలో ప్రసిద్ధమైనవి భ్రమర విన్యాసం. భారతజ్యోతి, సౌమ్య పురుషుడు, సాగర సంగీతం, గౌరి కల్యాణం మొదలైనవి. వాద్య బృందంలో ఆయన చేసిన ప్రయోగాల్లో ముఖ్యమైనది ఆర్కెస్ట్రాతో తోడిరాగం తానం పల్లవి కార్యక్రమం. ఇది 15 నిమిషాలు ఎంతో సమర్థవంతంగా నిర్వహించబడింది.

ఎప్పటికప్పుడు కొత్తదనాన్ని స్ఫురింపజేసే కల్పనా చాతుర్యం, పరిణతి చెంది పక్వమైన మనోధర్మం, కేవలం ఆవేశంలో పడిపోయి కొట్టుకుపోకుండా, ఏది ఎంత వాయించాలో అంతవరకే ప్రదర్శింపగలిగిన నిగ్రహం. ఇలాంటి లక్షణాలన్నీ కలిసి శంకరశాస్త్రిగారి వీణా వాయిద్యం ప్రత్యేకత సంతరించుకుని, ప్రత్యేక బాణీగా సర్వాంగ సుందరంగా రూపుదిద్దుకుంది.

రకరకాల శ్రోతల్ని ఆకట్టుకొనే సార్వజనీనత శంకరశాస్త్రి గారి సంగీతంలో ప్రధాన లక్షణం. ఆయన కచేరిలో వివిధ వాయింపు పాశ్చాత్య



సంగీతం కోసం, వేదం కోసం శ్రోతలు ఉత్కంఠతో చివరిదాకా కూర్చునే వారు. వీణతో గొంతు కలిపి వచనం వాయిస్తుంటే, మూర్తీభవించిన శాంతి దేవత పవిత్రవాణిలా ఉండేది.

వ్యక్తిగా ఆయన సౌమ్యుడు. ఆయన వాయిద్యం లాగే ఆయన మనసు మెత్తన, మాట మెత్తన. ఎంతో మంది శిష్యుల్ని తయారుచేసిన సద్గురువు ఆయన. హైదరాబాద్ ఆకాశవాణి కేంద్రంలో నిలయ విద్వాంసురాలిగా పనిజేసిన, వైణిక విదుషీమణి సరస్వతి ఆయన చెల్లెలు. ఈమని వంశంలో వీణా జ్యోతిని యువతరంలోకి తీసుకు వచ్చిన వర్ధమాన వైణికురాలు కల్యాణి ఆయన పుత్రిక. ఎంతో మధురంగా ఘజల్స్ పాడే లక్ష్మి ఆయన చివరి పుత్రిక. మద్రాసు కేంద్రంలో వాద్య బృందానికి కండక్టర్‌గా పనిచేసి, పదవీ విరమణ చేసిన శ్రీ కామశాస్త్రి, మద్రాసు దూరదర్శన్‌లో అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేసిన ఎం. ఎస్. శ్రీరామ్ - శాస్త్రిగారి మేనల్లుళ్ళు, శిష్యులు. ఆకాశవాణి కేంద్రాల్లో నిలయ విద్వాంసులుగా ఉన్న సత్యమూర్తి, రామచంద్రన్, రంగనాథన్, ఆయన శిష్యులే. ఇంకా ఢిల్లీలో శ్రీమతి సుభద్రానాగరాజ్, మద్రాసులో లక్ష్మయ్య ఆయన దగ్గర శిక్షణ పొందిన వారే. మొదటి శిష్యునిగా ఆయనతో నా సాంగత్యం సుమారు 47 ఏళ్ళు. ఇంక చిట్టిబాబు పేరు సుపరిచితమేకదా : చిట్టిబాబు విషయంలో ఇంకో విశేషం ఉంది. కళాప్రపూర్ణ, గౌరవ డాక్టరేట్ బిరుదులు అందుకున్న శంకరశాస్త్రిగారి జీవిత కాలంలోనే ఆయన శిష్యుడు చిట్టిబాబు కూడా అవే బిరుదులు పొందడం చిట్టిబాబు అదృష్టం.

ఆ 1987 డిసెంబర్‌లో మరపురాని కొన్ని సంఘటనలు జరిగాయి. ఆ సంవత్సరం విషాదాంతంగా ముగుస్తుందని అప్పుడు తెలియదు. డిసెంబరు 6న అభినందన సంస్థ నాకు సన్మానం ఏర్పాటు చేసి, శంకర శాస్త్రి గారిని పిలిపించి ఆయనచే నాకు సన్మానం చేయించారు. అదే నెల 20న గుంటూరులో నాగార్జున కల్చరల్ సంస్థ, చిట్టిబాబుని పిలిపించి గురువు గారికి కనకాభిషేకం చేయించారు.

నేను వ్రాసిన 'అమ్మదొంగా' అనే పాట ఆయనకెంతో ఇష్టం. 'ఇది ప్రత్యేకం వేదవతి కోసమే వ్రాసినట్టుంది' అనేవారు. నాకు జరిగిన సన్మాన సభలో నన్ను గురించి మాట్లాడుతూ మధ్యన, పీలగా లాంటి సన్నటి గాత్రంతో "అమ్మ దొంగా నిన్ను - చూడకుండా నాకు బెంగ" అని చల్లటి మనసుతో ఆయన పాడిన ఆ రెండు పల్లవులు నా మనస్సులో ఆయన ఆశీస్సులుగా నిలిచిపోయాయి.

—67వ జయంతి ఉత్సవ సంచిక నుంచి

సత్కవీంద్రులు

# జాషువా

## రంగనాథాచారి

ఆధునిక తెలుగు కవులలో అగ్రగణ్యుడు, ప్రాచీన సాంప్రదాయమైన ఛందో బద్ధ కవిత్వాన్ని విడనాడకుండా, యావత్ తెలుగు పాఠక లోకానికి అర్ధమయ్యే రీతిలో, తెలుగు కవిత్వాన్ని, పండిత, పామరులచే రంజింప చేసిన మధుర కవి జాషువా. సామాజికమైన ఆచారాలు, మతపరమైన ఆచారాలు బాగా నాటుకు పోయిన, 19వ శతాబ్ది చివరి రోజులలో జన్మించి, సంస్కర్త అయి, సంకెళ్లను విచ్ఛేదం చేసి, వ్యక్తి వికాసానికి దోహదం చేసిన మనీషి జాషువా. 28 సెప్టెంబర్, 1895 సం॥లో వినుకొండలో ఈయన జన్మించినారు. సాంఘిక రుగ్మత, కుల వ్యవస్థ చిన్నతనం నుంచి ఆయనను యిబ్బందుల పాలు చేసినాయి. ఏ స్వగ్రామంలో తనకు కులం కారణంగా అవమానాలు జరిగాయో, ఏ జన్మ భూమిలో తనలో పెరుగుతున్న సాహిత్యలతకు నీళ్లు కరువైనాయో, ఆ జన్మ భూమిపై ఆయనకు కక్షలేదు సరికదా, దానిపై అంతులేని అభిమానం, తరగని గౌరవం వున్నాయని శ్రీమతి హేమలతా లవణంగారు అన్న మాటలు ఆయన జీవిత చరిత్రను సూచిస్తాయి.

5వ తరగతిని వినుకొండలోని ఫాదరీ బడిలో విద్యాభ్యాసం పూర్తి చేసి, హైయ్యర్‌గ్రేడు బోర్డు హైస్కూల్లో తరువాత చేరి, ఆబడిలో, చదువుకునేటప్పుడు, తను పడ్డ మానసిక బాధను చూసి, ఆమె తల్లి లింగమాంబ 'నాయనా. మన దేశంలో కులభేదాలు గూడు కట్టుకున్నాయి. పంచమ జాతి వారికి కూడు హుళక్కి, మానవత హుళక్కి, అసలు అన్నమే హుళక్కి, ఏసు ప్రభువు ఒక్కరే వారికి దిక్కు' - అని పూరడించెను. అయినా తాను కర్మ సిద్ధాంతానికి ఊ కొట్టేవాడు కాకపోయినా, గాంధీజీ దళిత జాతుల సమున్నతి కోసం నడుం బిగించి, పనిచేయుచున్న సమయంలో, తాను తక్కువ కులంలో పుట్టినవాడు కావడం చేత, ప్రత్యేకంగా ఒక బెంచిపై కూచుని చదువుకొనుటకు ఏర్పడిన హద్దుల, గోడలతో గాయపడిన హృదయం, ఆనాటి సామాజిక పరిస్థితులపై తిరుగుబాటు చేసింది.

చదువు ముగిసిన తరువాత కొంత కాలానికి ఒక టూరింగ్ టాకీసులో ఎనౌన్సర్‌గా వుద్యోగం సంపాదించి తరువాత ప్రాథమిక పాఠశాలలో వుపాధ్యాయుడుగా చేరినాడు. తరువాత ఈయనలోని కళా పిపాసను గుర్తించిన సుబ్బారావుగారు, 'రుక్మిణీ కళ్యాణము' వ్రాయుటకు ప్రోత్సహించినారు. కొన్నాళ్లు మద్రాసు ఆకాశవాణి తెలుగు విభాగంలో పని చేసి, కవితా గోష్ఠులలో పాల్గొనటం, కావ్యరచన చేయటం మొదలైనవి కొనసాగించాడు. 'జీవితం నాకు ఎన్నో పాఠాలను నేర్పింది. నా గురువులు యిద్దరు : ఒకటి పేదరికం రెండోది ; కులమత భేదం, ఒకటి సహనాన్ని, మరొకటి శక్తిని ప్రసాదించింది' అన్నారు జాషువా. వాటిపై కత్తి కట్టారు. సంఘంపై ద్వేషం లేదు. విధానం పైనే ద్వేషం.

జాషువా రమారమి 30 కావ్యాలు రచించారు. 7 భాగాలు ఖండ కావ్యాలు, అనాథ స్వప్నకథ, గబ్బిలం, కాందిశీకుడు, నేతాజీ, బాపూజీ, ఫిరదౌసి మొదలగునవి. సాంఘిక వ్యవస్థలోని దురాచారాలను ఈయన ఈ విధంగా వర్ణించారు.

'ముసలివాడైన బ్రహ్మకు, పుట్టినారు
నలువురు కుమారులనుట, నిజ్జము కాని
పసరమున కన్న హీన దభాగ్యుడైన
ఐదవ కులస్తుడెవ్వరమ్మ సవిత్రి ?'

ఒకసారి జాషువా రైలులో ప్రయాణం చేస్తున్నారట. అదే కంపార్టుమెంటులో ఒక పండితుడు జాషువా కవిత్వాన్ని మెచ్చుకుని, ఏది నీ కులము ? - అని ప్రశ్నించినప్పుడు, 'నేను క్రైస్తవుడ్ని' అనే జవాబు విని, చోటు మార్చి మరొకచోట కూర్చున్నాడట. ఆ సంఘటన వేంకటగిరి రాజా గారికి ఈ విధంగా వివరించారు.

'నా కవితా వధూటి వదనంబు నెగాదిగ
జూచి రూపు రే
ఖా కమనీయ వైఖరులు గాంచి భళీ
భళీ యన్నవారె మీ
దే కులమన్న ప్రశ్న వెలయించి, చివా
లున లేచి పోవుచో
బాకున గ్రుమ్మినట్లగును పార్థివచంద్ర
వచింప సిగ్గగున్'

జాషువా రచించిన కావ్యాలలో ఫిరదౌసి, ముంతాజ్‌మహల్ ప్రసిద్ధమైనవి. తాజ్‌మహల్ రాజసం ఈ విధంగా వర్ణించారు.

'రాణి విడిచిపోయె రాజునొంటరి జేసి
రాజు విడిచిపోయె రాజ్యరమను
రాజ్యరమయు విడిచె రాజుల పెక్కండ్ర
తాజ విడువలేదు రాజసంబు'

ఈయన రచించిన కవిత్వాలలో శ్మశాన వాటిక, వైరాగ్యాన్ని మనకు చూపిస్తుంది.

'ఇచ్చోటనే సత్కవీంద్రుని కమ్మని
కలమ్ము నిప్పులలోనే గఱిగిపోయె

యిచ్చోటనే భూములేలు రాజన్యుని
యధికార ముద్రిక లంతరించె
యిచ్చోటనే లేత యిల్లాలి నల్లపూ
సల సౌరు, గంగలో గలిసిపోయె
యిచ్చోట నెట్టి పేరెన్నికం గనుగొన్న
చిత్రలేఖకుని కుంచియు నశించె.

ఇది పిశాచుతో నిటాలేక్షణుండు
గజ్జె గదలించి యాడు రంగ స్థలంబు
ఇది మరణదూత తీక్ష్ణమౌ దృష్టులొలయ
నవని పాలించు భస్మ సింహాసనంబు'

ఖండ కావ్య ప్రక్రియను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు జాషువా. ఆయనకు సన్మానములు, బిరుదులు, అసంఖ్యాకముగా వచ్చాయి. కవితా విశారద, కవికోకిల, నవయుగ కవి చక్రవర్తి, విధానపరిషత్‌లో సభ్యత్వం, కళాప్రపూర్ణ, పద్మభూషణ్ మొదలగు గౌరవాలు లభించాయి. సుమారు 5 దశాబ్దాలు తన కవితాశక్తిని సంఘ సంస్కరణ కోసం వినియోగించి 24 జూలై, 1971న స్వర్గస్థులైన జాషువా, తిరుపతి వేంకట కవులలో ఒకరైన శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు, గండపెండేరముతో తనని సత్కరించిన సన్మానాన్ని ఈ విధంగా చెప్పుతున్నారు :

'చెళపిళ సత్కవీశుడు, ప్రసిద్ధుడు, పిర,
శతావధాని, యాంధ్రుల పక్ష రక్త
వాళముల రూపము నెత్తిన బ్రాహ్మ
ణుండు, నా
పలుకుల రాణి పాదముల బంగరు గజ్జె
లతో నలంకరించుట్
సరిసె, నిదేమి హావలె ప్రశస్తి ? కవిత్వ
కళాపఘూటకిస్'

– 'సెక్యులరిస్ట్' పత్రిక సౌజన్యంతో





భారత ఖండంబు చక్కటి పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడసరి గొల్లవారు
పితుకుతున్నారు మూతులు బిగియగట్టి

—చిలకమర్తి లక్ష్మీనరసింహం



డబ్లిన్ నగరంలో బారిస్టర్ పట్టాకి చదువుతూ (1913) 'డివెలరా వల్ల ప్రభావితులై, జాతీయోద్యమ నాయకులుగా, సంఘ సంస్కారులుగా, శారదా నికేతనమ్ స్థాపకులే గాక, 'మాలపల్లి' వంటి విశిష్ట నవలను తెలుగు ప్రజకి యిచ్చిన గొప్ప సాహితీ వేత్తగా, గాంధీజీ అడుగు జాడలలో నడిచిన కర్మయోగి....

—ఉన్నవ లక్ష్మీనారాయణ

## గాంధీజీ ప్రారంభోత్సవం చేసిన

# పినాకినీ ఆశ్రమం

### బి. రాజారావు

ఆంధ్ర రాష్ట్రములో స్థాపింపబడిన సత్యాగ్రహాశ్రమాలలో ప్రప్రథమమున నెలకొల్పబడినది పినాకినీ సత్యాగ్రహాశ్రమం. ఇది నెల్లూరు జిల్లాలో నెల్లూరు నగరానికి 6 మైళ్ళ దూరంలో ఉన్న పల్లిపాడు అనే శ్రోత్రియ గ్రామంలో పినాకినీ నదీ తీరమునందు గలదు. దాని ప్రారంభోత్సవము 1921 సం॥ ఫిబ్రవరి 7వ తేదీన మహాత్మాగాంధీ గారే స్వయముగా చేసిరి.

## ఆశ్రమ స్థాపన

దక్షిణాఫ్రికా నుండి గాంధీగారు 1915 సం॥లో ఇండియాకు తిరిగి వచ్చిన తరువాత వారితో దిగుమర్తి హనుమంతరావు గార్కి పరిచయమేర్పడెను. అప్పట్లో హనుమంతరావు గారు సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటిలో సభ్యులుగా వుండి, దాని మద్రాసు శాఖలో పనిచేస్తూ ఉండేవారు. గాంధీగారు తన కుమారు దేవదాసు గాంధీ గారిని మద్రాసులో హిందీ ప్రచారం చేయమని పంపుతూ ఆయనకు సహాయముగా ఉండటానికి, సలహాలీయడానికి హనుమంతరావు గారి వద్దకు పరిచయ లేఖతో పంపిరి. సత్యాగ్రహ సిద్ధాంతములందు నమ్మిక ఏర్పడి, దాని ప్రకారం పనిచేయుటకు సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీలో సావకాశం లేనందున, దాని సభ్యత్వానికి రాజీనామా చేసి, హనుమంతరావు గారు గాంధీగారిచే స్థాపించబడిన సబర్మతీ సత్యాగ్రహాశ్రమానికి వెళ్ళిరి. వారు అక్కడ ఉంటున్న సమయంలో నెల్లూరు జిలా పల్లిపాడు శ్రోత్రియ గ్రామవాసులు చతుర్వేదుల వెంకట కృష్ణయ్యగారు కూడ సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళి, అక్కడ ఉండటం తటస్థించింది. సబర్మతీ సత్యాగ్రహాశ్రమ విధానం ప్రకారం, ఆంధ్ర రాష్ట్రములో ఒక ఆశ్రమం స్థాపించడానికి గాను గాంధీ గారు వీరిరువురిని నియోగించిరి. వారు పల్లిపాడు వద్ద, పినాకినీ నదీ తీరాన్న, ఆశ్రమం స్థాపించడానికి అనువుగా వుంటుందని నెల్లూరు పట్టణానికి అందుబాటు వల్ల ఆ నగరవాసుల సహాయము ఆదరాభిమానములు వుంటాయని యెంచి స్థల నిర్ణయము చేసిరి.

గాంధీగారి గుజరాతీ స్నేహితులకు సబర్మతీ ఆశ్రమంలో, దిగుమర్తి హనుమంతరావు గారితో పరిచయం గలగడం, ఆయన నిరాడంబరత, ప్రేమ, సమతాభావం, ఆదర్శ జీవనం వారి నాకర్షించినందున, ఆశ్రమ స్థాపనకు వారి సహాయము లభించినది. అంతేగాక గాంధీగారి కోరిక పైన జాతీయ మహాసభవారు రూ. 10,000/- లు విరాళమిచ్చిరి. ఈ సొమ్ముతో స్థల సంపాదన, కుటీర నిర్మాణం, ఖద్దరు పరిశ్రమకు ఏర్పాట్లు మొదలైనవన్ని జరిగినవి. ఆ తర్వాత గాంధీగారు, స్వయముగా ఆశ్రమ ప్రారంభోత్సవము జరిపిరి. ఆశ్రమానికి కొంత ఆస్థి, అనగా స్థలము, పరికరములు వగైరాలు చేకూరడం చేత, 1921వ సంవత్సరము నవంబరు 25వ తేదీన ఒక ట్రస్టు డీడు ద్వారా దానిని రిజిష్టరు చేయించిరి.

ప్రథమ ట్రష్టీలయిన (1) దిగుమర్తి హనుమంతరావు గారు, (2) వారి సతీమణి డి. బుచ్చి క్రిష్ణమ్మ గారు, (3) చతుర్వేదుల వెంకట కృష్ణయ్యగారు, (4) కొడిపర్తి పున్నయ్య గారు, యావజ్జీవ ట్రస్టీలగాను, ఆశ్రమ సభ్యుల నుండి సంవత్సరం, సంవత్సరం ఎన్నుకొనబడు మరి యిద్దరు ట్రస్టీలున్నూ కలసి ట్రస్టుబోర్డుగా వ్యవరించుటకు ఏర్పాటు చేసిరి. ట్రస్టుబోర్డు సభ్యుల సంఖ్య ఆరుగురికి మించరాదని నియమ మేర్పాటు చేసిరి.

ధర్మిలా ఆశ్రమ పుస్తక భాండాగారం కొరకు ఒక డాబాయిల్లు నిర్మింప బడినది. ఇందుకైన సొమ్ము గాంధీగారి స్నేహితులు రుస్తుంజీగారు యిచ్చిరి. నెల్లూరు నగరంలోని ప్రఖ్యాత ధనవంతులు, జాతీయవాదులైన తిక్కవరపు రామిరెడ్డిగారు, వారి భార్య [illegible]ర్యనమ్మగారు, పొణాక కనకమ్మ గారు, బెజవాడ మీనాపమూరి గారు, మైనాడు వాస్తవ్యులు వెంకురెడ్డిగారు మొదలగు వారు అందరూ ఆశ్రమ కార్యక్రమములందు ఆదరాభిమానములు చూపి దాని అభివృద్ధికి తోడ్పడిరి.

## ఆశ్రమోద్దేశములు

(ట్రస్టుడీడులో నుదహరింపబడినవి).

(1) గాంధీమహాత్ముని సత్యాగ్రహ సిద్ధాంతాలను, విధానములను ఆంధ్ర దేశమంతటను వ్యాపింప జేయుటయు, స్వార్థమునకాని, అన్యుల పీడనకు వెరవనిగాని అణుమాత్రము చలించని నైతిక, ధార్మిక బలముగల సేవాతత్పరుల నుద్భవింప జేయుటకు, (2) సత్యాగ్రహ సిద్ధాంతముల ననుసరించి మానవసేవకై తమ జీవితమంతయు ధారవోయువారు యెంత మందియైనను స్వయం సహాయవ్రతమున నిల్చుటకు వీలగుటకు, జీవనోపాధి గలిగి స్వతంత్ర జీవనయాత్ర సల్పుటకు వలయు సాధన సంపత్తి చేకూర్చుటయు, (3) అన్యుల దయా దాక్షిణ్యమునగాక, ఆశ్రమ పోషణ కేవలము స్వయం సహాయముననే

ఆధారపడియుండుట కనువుగా వ్యవసాయము, నూలు వడుకుట, నేయుట మున్నగు గృహ పరిశ్రమల గల్పించుకొనుటయు, ఆశ్రమ సభ్యుల వేతనముగ నేమియు స్వీకరింపకుండుటయు.

## ఆశ్రమ కార్యక్రమములు

1. ఖాదీ పరిశ్రమ : దీనిని అభివృద్ధిపరచుటకుగాను వడుకుట, నేతకు తగిన ఏర్పాట్లు చేయబడెను.

2. హరిజన సమస్య : నూలుతో వడుకువారు చాలా మంది కలరు. ఈ హరిజనులకును, నేతవారికిని ఆశ్రమంలోనే బస ఏర్పాటు చేసి అంటరాని తనమును మాన్పుటకు కూడా ఆచరణ ద్వారాను, ప్రచారము ద్వారాను, ప్రయత్నములు జరిగెను. ఖాదీకి అందరి ఆదరమును, ప్రోత్సాహమును లభించెను. కాని హరిజనులను సంఘములో కలుపుకొనుటకు మాత్రము ప్రారంభ దశలో గ్రామస్థుల బహిష్కారమునకు కారణమాయెను. అసలే పల్లెపాడు శ్రోత్రియ గ్రామము. మాలవారు కొన్ని వీధుల గుండా పోనేపోగూడదు. కానీ క్రమేపీ సభ్యుల నిరాడంబర జీవితము, పరిశుద్ధ ప్రవర్తన, సంఘ శ్రేయస్సుకు చేయు కృషి, క్షమాగుణము అందరి యెడల చూపబడు సమానాదరము, ప్రేమ ఈ శ్రోత్రియ గ్రామస్థులలో కూడా అనుకూలమైన మార్పు తెచ్చెను.

3. వ్యవసాయము : స్వయం పోషక సిద్ధాంతము ప్రకారము ఆశ్రమ వాసులందరూ వ్యవసాయములోను, నూలు వడుకుట, నేయుటలోను పాల్గొనుచుండిరి.

4. హిందీ ప్రచారం : రాష్ట్ర బాషా ప్రచారము దేశ సమైక్యత కావడమువల్ల హిందీ ప్రచారము ఆశ్రమ కార్యక్రమములలో నొకటిగా తీసుకొనబడెను. ఇందుకు ఆశ్రమంలలో హిందీ క్లాసులు నడుపబడుచుండెను.

5. వయోజన విద్య : రాత్రి పాఠశాలల ద్వారా, మాల గూడెములలోను ఆశ్రమంలో నివాసమున్న వడుకువారు, నేతవారలకు వయోజన విద్యా ప్రచారము సాగుచుండెను.

6. సాంఘిక సామరస్యము : తగాదాలతో రాజీపరిష్కారములు మొదలగు వాటి ద్వారాను కుల, మత భేదములు లేవి సాంఘిక జీవనము ద్వారాను, సాంఘిక సామరస్యమునకు పయత్నములు జయప్రదముగా జరుగుచుండెను.

7. ప్రకృతి చికిత్స : హనుమంతరావుగారికి అంతకుమునుపే ప్రకృతి చికిత్సలో అనుభవముండెను. యూకుహినేగారి తొట్టిస్నానములు, స్వాత్వికాహారము, ఆతస్నానములు, ఆవాపట్టుట, సూర్యరశ్మిని ఇముడ్చుకున్న వివిధ రంగుల సీసాలలోని నీటి ద్వారాను, ఇతర క్రోమోపతీల పద్ధతి



# తెలుగులో ఇస్లామీయ ప్రచురణలు

| క్రమ సంఖ్య | పుస్తకం పేరు | వెల : రూ. పై. |
|---|---|---|
| 1. | ప్రవక్త సందేశం | 1-00 |
| 2. | ఆధునిక ఆర్థిక సిద్ధాంతాలు | 12-00 |
| 3. | ఇదియే ఇస్లాం | 21-00 |
| 4. | నేను ఆరాధించే ఇస్లాం | 15-00 |
| 5. | ధర్మపథంలో జీవన రథం | 10-00 |
| 6. | అంటరానితనం | 1-60 |
| 7. | శ్రేయస్కరమార్గం | 3-90 |
| 8. | మరణానంతర జీవితం | 2-00 |
| 9. | ఇస్లాం పరిచయం | 3-00 |
| 10. | పరదా ప్రగతికి ప్రతిబంధకమా ? | 1-60 |
| 11. | సందేహాలు - సమాధానాలు | 25-00 |
| 12. | ఇస్లాం రాజకీయ సిద్ధాంతం | 3-10 |
| 13. | హేతువుకాంతిలో దైవప్రవక్త | 2-80 |
| 14. | ఆదర్శమూర్తి | 1-00 |
| 15. | సత్యధర్మం | 2-40 |
| 16. | భవబంధాలు మోక్షానికి ప్రతిబంధకాలా ? | 3-00 |
| 17. | నిర్మాణం - విచ్ఛిన్నం | 3-00 |

వీటితోపాటు ఖుర్ ఆన్ హదీసు ప్రవక్త జీవిత చరిత్ర
ఇంకా అనేక విషయాలపై పుస్తకాలను వ్రాయించింది.

## తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్

సందేశ భవనం, లక్కడ్ కోట్,
ఛత్తాబజార్, హైదరాబాదు - 500 002.
ఫోన్ : 521237



లోను చికిత్సకు ఏర్పాట్లు చేయబడెను. ఇది చాలా మందిని అకర్షించెను అనేక మంది దీర్ఘవ్యాధి గ్రస్తులు, రోగులు ఈ చికిత్సను పొందుటకు వచ్చి ఆశ్రమ పర్ణశాల లో నివసించుచు ఆశ్రమ జీవితంలో పాల్గొనుచుండిరి.

8. ఈ విధముగ ఇతర నిర్మాణాత్మక కార్యక్రమముల ప్రచారములు జరుగుచుండెను.

9. ముఖ్యముగా ఆశ్రమ నియమములు, సత్యము, అహింస, అస్తేయము, అపరిగ్రహము, బ్రహ్మచర్యము, స్వదేశీ మొదలయిన ఏకాదశ వ్రతములు, ఆత్మశుద్ధితోను, హృదయ పూర్వకముగను ఆచరింపబడుచుండెను.

## ఆశ్రమ దినచర్య

ఉదయం గం 4-30 ని॥లకు లేచి కాలకృత్యములు తీర్చుకొనిన పిమ్మట ప్రార్ధన, సాముహిక సేవల తరువాత స్నానాదికములు ముగించి ఎవరి పనులలోకి వారు పోవుదురు. మధ్యాహ్నం సాముహిక సూత్ర యజ్ఞము జరుగుచుండెను. సాయంకాలం 6 గంటలకు భోజనానంతరము ప్రార్ధన, తదుపరి ఆ దర్మ జీవితము నకు సంబంధించిన గ్రంథపఠనము, ఆశ్రమములోని హరి జనులకు మున్నగువారికి వయోజన విద్య, రాత్రి 9-30 గంటలకు నిద్రించుట.

## ఆశ్రమ సేవకులు

ఆశ్రమ కార్య క్రమములలో సహాయము చేయుటకు ఆశ్రమ సభ్యులుగా కాక సేవకులుగా దిగుమర్తి వెంకట రామస్వామిగారు, కాసా సుబ్బారావు గారు, ఇసుకా చెంచయ్యగారు, కాళకూరి వెంకట్రావు గారు, వారి వారి కుటుంబములతో సహా అచ్చట నివాస మేర్పరచుకొని పని చేయు చుండిరి, గుమ్మిడిదల సుబ్బారావుగారు. మానికొండ సత్యనారాయణగారు, వాడరేవు జగ్గరాజుగారు, తిరుపతి రాయడుగారు మొదలైన వారలనేక మంది కూడ వచ్చి కొలది కాలము ఆశ్రమ జీవితములో పాల్గొనిరి.

బందిపోటు ఉదంతము ఆశ్రమ వాసులను పరీక్షించుటలో యనునట్లు 1953లో ఒక బందిపోటు ముఠా 16 మంది ఆశ్రయంలో జొరపడి దానిని కొల్లగొట్టిరి. ఆ దొంగలు ఆశ్రమములోని స్త్రీలను కూడ వదలలేదు. చాలా మందికి దెబ్బలు కూడ తగిలినవి. ఐనప్పటికి ఆశ్రమ వాసులు పోలీసులకు రిపోర్టు చేయలేదు. తిండికి లేనివారు చేసిన పని యని సమాధానపడి యూరకుండిరి. కాని యీ ఉదంతము ఇతరులందరి లోను సంచలనం కలిగించి, ఫిర్యాదు లేనప్పటికి, పోలీసులు తమంతట తామే యీదొంగలను పట్టుకొనునట్లు చేసినది. బందిపోటు దొంగలకు వెనుక దన్నుగా నుండు ఘరానా పెద్దలు వారిని విడనాడరి. ఈ నింది

తులకు వ్యతిరేకి సాక్ష్యమిచ్చుటకు కూడ ఆశ్రమవాసులు అంగీకరించ లేదు. దొంగతనము చేయబడిన కొన్ని బంగారు అలంకారములను పోల్చు కొనుటకు పిలువబడిన డి. బుచ్చి కృష్ణమ్మగారు వాటిని చూచి అవి తన సరకుల వలెనే యున్నవని గాని అవి తనవేయని నిర్ధారణ చెప్పజాలమనిరి. సాక్ష్య మిచ్చుటకు అంగీకరించలేదు. ఆమెను, ఆమె ప్రవర్తనను చూచి నంతనే దొంగలు విస్మయము జెంది, తమ నేరములను తామే ఒప్పుకొని యా వృత్తాంతమును సవివరముగా చెప్పివేసిరి. దానివలన కేసు బుజువై దొంగలు శిక్షింపబడిరి. ఈ విష యము గాంధీగారికి తెలిసినప్పుడు ఆయన ఆశ్రమవాసుల యొక్కయు, ముఖ్యముగా బుచ్చికృష్ణమ్మగారి యొక్క ధైర్యమును, ప్రవర్తనను మెచ్చుకొనిరి. అది ఆశ్రమ వాసులకొక గుణపాఠము అనియు, అపరిగ్రహము, ఆస్తేయము ఆదర్శముగా గల ఆశ్రమ సభ్యులు దొంగల నాకర్షించు ఆభరణముల ధరించుటగాని, ధనం దాచుకోవడం గాని కూడదన్న విషయము గ్రహింతురని విశ్వసించు చున్నానని తెల్పిరి.

## ఆశ్రమంలో మార్పులు

దురదృష్టవశాత్తు 1925వ సంవత్సరములో హనుమంతరావు గారు రోగగ్రస్తులైరి. తాత్కాలికంగా తిరిగి ఆరోగ్యమును పొందినప్పటికి మరల కొద్ది కాలమునకే అది తిరగబెట్టెను ప్రకృతి చికిత్సనే వారు పొందు చుండిరి. రాజమహేంద్రవరములో కొంతకాలము చికిత్సను పొంది, విశాఖపట్టణము వెళ్ళిరి. అక్కడ ఆయన ఒంపుపులు పెరుకెక్కిన అలోపతి డాక్టరున్నప్పటికి, ఆయన ప్రకృతి చికిత్సను విడనాడలేదు. చివరకు 1926 మార్చి నెలాఖరులో ఈ భౌతిక దేహమును విడిచి పరమ పదించింది.

వారి మరణానంతరము నాటి ఆశ్రమ ప్రముఖులైన పండ్రేవుల వెంకట కృష్ణయ్యగారు పాండిచ్చేరి లోని అరవిందాశ్రమానికి, కొండి..రి పున్నయ్యగారు ఖాదీసంఘంలో పని చేయుటకు ఆశ్రమం విడిచి వెళ్ళి పోయిరి. ఆశ్రమ మేనేజరుగా పని చేయుచుండిన కాశా సుబ్బారావుగారు ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారి స్వరాజ్య పత్రికలో ఉప సంపాధకులుగా చేరిరి. దిగుమర్తి వెంకట రామస్వామి గారు కాంగ్రెస్ సేవకులుగా గంజాం జిల్లా వెడలిరి. ఇసుకా వెంకయ్యగారు, ఆయన భార్య బ్రహ్మ సమాజం వారి ఆడపిల్లల హాస్టల్ నడుపుటకు వెళ్ళిరి. కాళ్ళకూరి వెంకట్రావు గారు, వారి కుటుంబము కూడా ఆశ్రమము విడిచి వెళ్ళిరి. ఈ విధముగా ఆశ్రమము కుంటుపడెను. ఖాదీ కార్యక్రమం మాత్రము కొంత కాలము సాగుచుండెను. మొదటి నుండి ఈ కార్యక్రమములో

పాల్గొనిన రెంటాల కృష్ణమ్మ గారు ఆయన భార్య సుబ్బమ్మగారు చాల సంవత్సరములు ఆశ్రమములోనే వుండి, ఈ కార్యక్రమమును నడుపుచుండిరి. ఆ తరువాత వారు కూడ వదిలి వెళ్ళిపోయిరి. ఆశ్రమ యావజ్జీవ ట్రస్టీలలో ఒకరైన బుచ్చి కృష్ణమ్మ గారు ఒక్కరే మిగిలిరి. ఆమె స్త్రీ యగుటచేతను, సహాయకారిగా ఆశ్రమ వ్యవహారములను చూచుచుండమని కొండా వెంకటప్పయ్య పంతులు గారిని, గాంధీగారు కోరిరి.

కొంతకాలము ఆంధ్ర ప్రకృతి చికిత్స, ఆయుర్వేద వైద్యము కార్యక్రమములను ప్రసిద్ధ కాంగ్రెస్ సేవకులు ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు నడుపుచుండిరి. దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారు వృద్ధాప్యము వలనను, అనారోగ్యము వలనను, చివరి రోజులలో ఆశ్రమ వ్యవహారములు చూచుట కష్టమయ్యేను ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు కారణాంతరముల వలన ఆశ్రమము లోని ప్రకృతి చికిత్స, ఆయుర్వేద వైద్యము, ఖాదీ మొదలైన కార్యక్రమములను నడుపుటకు అవకాశము లేకపోయెను. అట్టి పరిస్థితులలో కొండా వెంకటప్పయ్య పంతులు గారు, ఆశ్రమ కాగితములు, లెక్కలు మొదలైన వాటిని బుచ్చి కృష్ణమ్మ గారికి వప్పజెప్పి, అవసరమైన సహాయము ఇతరుల వలన పొందుచు, ఆశ్రమ నిర్వాహణకు పూనుకొన వలసినదని చెప్పిరి.

## ప్రస్తుత కార్యక్రమములు

అప్పటికే బుచ్చి కృష్ణమ్మగారు గాంధీగారిచే ఏర్పాటు చేయబడిన కస్తూర్బా గాంధీ రాష్ట్రీయ స్మారక ట్రస్టులో ఆంధ్రశాఖ ఏజంటుగా వుండుటచే ట్రస్టు కార్యక్రమాల్లో చేరిన గ్రామ సేవా కేంద్రాన్ని, ఆరోగ్య కేంద్రాన్ని ఆశ్రమంలో 1952 సం. లో నెలకొల్పిరి. ఇందుకు ప్రత్యేక శిక్షణ పొందిన గ్రామ సేవిక ద్వారాను, చుట్టుప్రక్కల గ్రామాల్లోని స్త్రీల యొక్కయు, పిల్లల యొక్కయు సేవకు ఏర్పాటు చేసిరి. దీని క్రింద ఆశ్రమంలో 3 సంవత్సరముల నుండి 7 సంవత్సరముల లోపు పిల్లలకు ఒక బాల్వాడీయు, మాతా శిశు సంక్షేమ కేంద్రమును నడుపబడుచుండెను. తేనె పరిశ్రమ, కుట్టు మొదలగు చేతి పనులు నేర్పుటకు కూడా ప్రయత్నములు జరిగెను. కాని ప్రభుత్వపు కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కార్యక్రమము ఆచరణలోనికి వచ్చిన పిమ్మట ఆరోగ్య సేవిక యొక్క కార్యక్రమము వారే చేయుటచే ఈ ఆరోగ్య కేంద్రమును మూసివేసిరి. కారణాంతరము వలన బాల్వాడీ కూడ మూయబడెను.

తదుపరి ఆశ్రమము స్వయం పోషకం చేసి, తిరిగి నిర్మాణ కార్యక్రమములనె పెట్టి, వృద్ధికి తేగలరను నమ్మకముతో ఆంధ్ర గ్రామ స్వరాజ్య సంఘం (తిరుపతి) వారికి 1968 వ సంవత్సముతో లీజుకివ్వబడెను. కానీ

వారేమీ చేయలేకపోయిరి. అందువల్ల తిరిగి 14-6-1976న వారి నుండి తీసుకొని, దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మగారు పల్లిపాడు గ్రామ వాస్తవ్యులు కొందరిని స్థానిక కమిటీగా ఏర్పరచి ఆశ్రమ వ్యవహారాలను నడుపుటకు నియోగించిరి. గాంధేయ సిద్ధాంతాలకు, ఆశ్రమ ఉద్దేశ్యాలకు, అనుగుణంగా గ్రామ వికాస కార్యాలను ఈ స్థానిక కమిటీవారు రావి ప్రోలు రామమూర్తిగారిని కన్వీనరుగా, ప్రముఖ నాయకుడు, సంఘ సేవకుడు, వెన్నెలకంటి రాఘవయ్య గారి పర్యవేక్షణలో కొంత కాలము నడిపినారు. పట్టు, తేనె, చిరుబాపల నేత మొదలగు గ్రామీణ నిర్మాణాత్మక కార్యక్రమములు చేపట్టబడినవి. ఒక ఆరోగ్య కేంద్రం కూడా కొన్నాళ్ళు నడుపబడెను.

ఆ తరువాత 1983 సం॥లో ఆశ్రమ ఆవరణలో పల్లెవాసులకు శుల్కం లేకుండ, ప్రత్యేక రీతిలో విద్యాబోధన చేసేందుకు, ప్రయోగాత్మకంగా విద్యా రంగంలో కృషి చేసేందుకు 'స్వజన ఎడ్యుకేషనల్ ట్రస్టు' అను సంస్థ వారు ముందుకు రాగా, వారికి ఆశ్రమంలో తగిన వీలు, 6 సంవత్సరములపాటు ఒక బడిని నడిపిన తరువాత, ఆ కార్యక్రమం కొనసాగలేదు. 1989 సం.లో వారి లీజు రద్దుచేయబడి, 1990 సం. నుండి పినాకినీ ఎడ్యుకేషనల్ సొసైటీ అను సంస్థవారికి ఆశ్రమ భవనాన్నీ, కొంత స్థలమును మాత్రము, ఒక రెసిడెన్సియల్ పాఠశాలను నడిపేందుకు లీజుకు యివ్వబడినది. ప్రస్తుతం ఈ బడి దాదాపు 100 మంది విద్యార్థులతో ఆశాజనకంగా నడుస్తున్నది. ఆశ్రమంలోని మిగులు భూమిని కొందరు స్థానిక రైతులు కొన్ని సంవత్సరాలుగా కౌలుకు సాగు చేస్తున్నారు. రానున్న ఒకటి, రెండు సంవత్సరాలలో వీరి కౌలును ముగించి, ఆ మొత్తం స్థలంలో గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమములను చేపట్టేందుకు, ట్రస్టువారు ఏర్పాటు చేస్తున్నట్లు, మాతా శిశు కేంద్రము, వృద్ధాశ్రమము, పండ్లతోటలు, కుటీర పరిశ్రమలు మొదలగు కార్యక్రమములు అంశాలుగా యుంటాయని కూడ రచయితకు అందించిన సమాచారములో తెలియజేసారు.

1989 సంవత్సరములో బుచ్చి కృష్ణమ్మగారు, (ప్రముఖ చిత్రకారుడు దామెర్ల రామారావుగారి సోదరి) తాము ఆశ్రమ ట్రస్టుకు అధ్యక్షులుగా ఉంటూ, ఆశ్రమ నిర్వాహణ, అవసరాలు రీత్యా తమకు గల అధికారాలను సారంగా మరి అయిదుగురు సభ్యులను యావజీవ ట్రస్టీలుగా నియమించిరి. వారలు (1) అల్లాడి వాసుదేవన్, నెల్లూరు (2) తురగా సుబ్రహ్మణ్యం, హైదరాబాద్, (3) దిగుమర్తి గోపాల స్వామి, విశాఖపట్నం, (4) దామెర్ల రామారావు, రాజమండ్రి, (5) మావిళ్ళపల్లి చక్రవర్తి, హైదరాబాద్. ఆశ్రమ భూముల వైశాల్యము సుమారు 22 ఎకరములు. వార్షికంగా

వచ్చే లీజు, కౌలు మొత్తాలు ఆశ్రమము ఆదాయం ప్రస్తుతానికి ప్రభుత్వ సహాయం ఏమీ లేనందువలన, ప్రత్యేకంగా సిబ్బందిని నియమించకుండా ఆశ్రమ వ్యవహారాలను ఆశ్రమ ట్రస్టు వారే స్వయంగా ముఖ్యంగా నెల్లూరు వాస్తవ్యులైనటువంటి అల్లాడి వాసుదేవన్ గారి సహాయంతో నడుపుచున్నారు. వీలైనంతవరకు స్వయం పోషకంగా ఆశ్రమాన్ని తీర్చిదిది, ఆశ్రమ నిర్మాణ కార్యక్రమాలు చేపట్టడమన్నది ఆశ్రమ ఆశయాలలో ఒకటి కాబట్టి ఈ బాధ్యత వారిపైన ఉన్నదన్నది నిర్వివాదాంశము.

బాపూ ఆశించిన గ్రామ స్వరాజ్యానికి పునాదులు గ్రామీణ పునర్నిర్మాణము కాబట్టి, బాపూ కోరిన నిర్మాణాత్మక పనులు చేపట్టి గ్రామీణ ప్రజలకు తగిన పని కల్పించిననాడు, ఆర్థికాభివృద్ధి, సాంఘిక సమన్వయం ఏర్పడుతాయి. జాతి ఐక్యతాభావాలకు నిలయంగా ఆశ్రమాలు ఎంతగానో తోడ్పడినట్లు, చరిత్ర పుటలు స్పష్టం చేసినపుడు, ఆశ్రమాలు పునరుద్ధరణ పాటు విస్తృతపరచి నాటి స్ఫూర్తిని ప్రజల్లో రేకెత్తించి, సమసమాజ స్థాపనకు పూనుకున్న నాడు భారతదేశం ప్రాచీన ఔన్నత్యాన్ని తిరిగి పొందగలదేమో !

**('సీతానగర సేవాశ్రమ చరిత్ర' నుండి 'గాంధీ క్షేత్రం'లో వెలువడ్డ వ్యాసం .... పునర్ముద్రితం ... రాజారావుగారికీ పరిచురణ కర్తలకీ కృతజ్ఞతతో.**

## డైరీ

ఆగస్టు 31, 1992

"సంపద, సన్మిత్రులు, పేరు ప్రఖ్యాతులు, ఆదరించే బంధువర్గం - అన్నీ వున్నప్పటికీ నా మనసు "దేని కనో ఆరాటపడసాగింది; ఇదంతా కాదు, ఒక గట్టిమేల్ చేయాలి - అని పించింది. నా మనోవీధిని బాబా ఆమ్టె మెదిలారు. అంతటి శక్తి సామర్థ్యాలు నాకు లేకపోయినా, ఆయన వర వడిలో, నాదైన రచనాలోకం ద్వారా ఒక మంచిపని చేయాలని మనసు యువ్విళ్లూరింది. అనాదిగా వేదకాలం నుంచీ ఈ దేశాన్ని ఒకటిగా నిలబెడు తున్నది సాహిత్యం. ఆ సాహిత్యం ద్వారా ఈ దేశసమగ్రతకు, సమైక్యతకు, నాదైనకృషి ఉడుతా భక్తిగా చేయాలనే తపన అంకురించి, ఈ విషయం, కేంద్రసాహిత్య అకాడమీ కార్యదర్శి ఇంద్రనాథ్ చౌధురితో (నేను ప్రాంతీయ కార్య వర్గ సభ్యురాలిని) సంప్రదించగా ఆయన భేషుగ్గా వుందనీ 'గో ఎహెడ్' అనీ అన్నారు. వారి ప్రోత్సాహం నాకు మనోధైర్యాన్ని యిచ్చింది. చెప్పుకో దగ్గ సాహిత్యంగల భాషలు మనకు పద్దెనిమిది వున్నాయి. మన దేశాన్ని స్థూలంగా ఉత్తర, దక్షిణ, ప్రాక్, పశ్చిమ ప్రాంతాలుగా విభజించవచ్చు. ఆయా ప్రాంతాలలోని వివిధ భాషల సాహితీ వేత్తలతో పరిచయం ఏర్పరు చుకు, ఇష్టాగోష్టి జరిపి, దాని నంతటినీ యావద్భారత స్థాయికి తీసుకు రావాలని నా ప్రయత్నమూ లక్ష్యమూను - Knit India Through Literature - అందుకోసం నేను స్వయంగా పర్యటించి విషయ సేకరణ గావించి, సారాంశం గ్రంథరూపాన వెలువరిస్తాను. ఈ బృహత్కృషి నా ఒక్క చేతిమీద అయేపని కాదు - ఎందరి సహకారమో కావాలి" - అన్నారు శివశంకరి, కెన్నమెరాలో, ఈ ప్రాజెక్ట్ వివరాలు చెబుతూ. ప్రారంభంలో భవానీ రాజగోపాల్ ప్రార్థన, మాలన్ స్వాగత వచనం, ఈ సమావేశకర్త తమిళనాడు కాంగ్రెసు నాయకులు మూపనార్.... కమిటీలో బాలచందర్, భారతీరాజా, చొ - రామస్వామి, మణియన్. ముక్తా శ్రీనివాసన్, ఓబుల్ రెడ్డి, పద్మా సుబ్రహ్మణ్యం, అపోల్లో పిసి రెడ్డి

ఎమ్ ఎ ఎమ్ రామస్వామి, రాధాశెట్టి, ఎ వి యమ్ శరవణన్, యమ్మెస్ స్వామినాథన్, ఆదిత్యన్, టి టి వాసు మున్నగువారున్నారు. కుటుంబమిత్రులైన మూపనార్ పూనుకోవడం, యిందరు ప్రసిద్ధ వ్యక్తుల ఆశీర్వాదం శివశంకరి సత్కృషికి సహాయపడతా యనటంలో సందేహం లేదు. ఇక వక్తలు.

"చుట్టూ చేరేవారి పొగడ్తలు అందమైన అతివల మనో దృక్పథాన్ని కొంతమేర చెడగొట్టవచ్చు. కాని, శివశంకరి విషయంలో మాత్రం అది సర్వాబద్ధం. మనిషీ, మనసూ ఎంత అందమైనవో, సంకల్పబలం అంత దృఢమైనది. విద్యావినయ సంస్కారాలతో విలసిల్లే శివశంకరి వంటి విదుషీమణులు చాలా అరుదు. ఆమె కృషి తప్పక ఫలిస్తుంది" - అన్నారు ఢిల్లీ నుంచి వచ్చిన కుష్వంత్ సింగ్.

"ఒకసారి బొంబయిలో మా ఆఫీసు కొచ్చినప్పుడు, ఈమె నంత సీరియస్‌గా తీసుకోలేదు - సాధారణ పొగడ్త లనుకున్నాను. కాని, 1985 నాటి రాజీవ్‌గాంధీ 'ఫారెన్ టూర్'లో ఈమెని చూసినప్పుడు, 'ఈ శివశంకరి సామాన్య వ్యక్తి కాదు' అని తెలుసుకున్నాను. ఆ టూర్‌లో ఈమె చూపిన చొరవ, సాహసమూ, గుప్త విషయం రాబట్టడంలో గల నైపుణ్యం స్నేహ పాత్రత నన్ను విస్మయ పరిచాయి. ఆమె రచనల గురించి వినడమే గాని నేను చదవలేదు. వ్యక్తిగా ఆమె పట్ల నాకెంతో గౌరవం. ఆమె చేబట్టిన ఈ కార్యం విజయవంత మవాలని అభిలషిస్తున్నాను," - అన్నారు బొంబయి నుంచి వచ్చిన 'రీడర్స్ డైజస్ట్' ఎడిటర్ అశోక్ మహాదేవన్.

"మనకు ఆఫ్రికన్ సాహిత్యం గురించి, యూరోపియన్ సాహిత్యం గురించి తెలుసు గాని, ఇరుగు పొరుగు మన సాహిత్యాల గురించి గాని, సాహితీవేత్తల గురించి గాని తెలియదు. భాషావాదం వెర్రితలలు వేసి ఎక్కడికక్కడ గోడలు కట్టుకుంది. ఇంత సంకుచితత్వం ఇదివరకు వుండేది కాదు. శివశంకరి గొప్ప ప్రయత్నం చేస్తున్నారు - ముళ్లకంచెలు నరుక్కుంటూ ముందుకి వెళ్లవలసి వుంటుందామె," - అన్నారు కేరళ నుంచి వచ్చిన 'మాతృభూమి' సంపాదకులు వాసుదేవన్ నాయర్.

"నేటి పరిస్థితులలో సాహిత్యమొక్కటే వేర్వేరు ప్రాంతాల మధ్య వంతెనలు వేయగల సాధనం. ఒకప్పుడు సంస్కృతం మనందరికీ మాతృస్థానంలో ఉండేది. మన సాహిత్యం పొరుగు ప్రాంతానికి తెలియాలంటే హిందీనో, ఇంగ్లీషునో ఆశ్రయించక తప్పదు. అనువాదాల ద్వారానే ఏ భాషా సాహిత్యమైనా విస్తృత మవుతుంది. శివశంకరికీ నాకూ ఆలోచనా విధానంలో ఎంతో సామీప్యత ఉంది. ఆమె ప్రయత్నం విజయవంత మవాలని కోరుకుంటున్నాను" - అన్నారు కలకత్తా నుంచి వచ్చిన.

భారతీయ భాషా పరిషత్తు సెక్రటరీ కుసుమ్ ఖెమానీ.

ఆ తర్వాత వైరముత్తు, మూప నార్ ప్రసంగించారు. సభా ప్రారంభం లో శివశంకరి స్పీచ్ అయాక, ఇండి యన్ బాంక్ ఛెయిర్మాన్ యమ్. గోపాలకృష్ణన్, ఈ ప్రాజక్టుకి గాను, ఒక లక్ష రూపాయిలు విరాళంగా చెక్కు సమర్పించారు. మాటలన్నీ ఒక ఎత్తు, ఈ లక్ష రూపాయిల చెక్కు ఒక్కటే ఒక ఎత్తు .. ఇండియన్ బాంక్ గోపాలకృష్ణన్ ఏదో ఒక సందర్భంగా తరుచూ టివిలో కనిపిస్తా రనే అభియోగం ఉంది. ఇన్ని మంచి పనులకు తానున్నాననీ, తమ బాంక్ అండ వుంటుందనీ ముందు నిలబడే వ్యక్తి ఎన్నిసార్లు కనిపిస్తేనేం!.... శివశంకరి సాహితీ యాత్ర విజయ వంతమై సత్ఫలితాల నీయగలదని మనసారా నమ్ముతున్నాము.

## సెప్టెంబరు 5, 1992

తమిళ సాహిత్య రంగంలో 'యస్ వియస్' సుప్రసిద్ధులు. ఆదర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా, మద్రాసు శాఖ కార్య దర్శి, మాలతీ చందూర్ 'సద్యోగం' నవల, 'పకీలు సుమిత్ర'గా తమిళ పాఠక లోకానికి పరిచయం చేసిన సాహితీ మిత్రులు. గోపాలపురం ఖాదీ గ్రామోద్యోగ్ భవన్‌లో, జస్టిస్ కృష్ణ స్వామి రెడ్డియార్ అధ్యక్షతను, 'యస్వియస్' 70వ జన్మదినోత్సవ వేడుక. ఆయన 60వ జన్మదినోత్సవా నికి కూడా మేము యటెండయాము. 'కల్కి' పత్రికలో ఉపసంపాదకునిగా, రాజాజీ వద్ద కార్యదర్శిగా పనిచేసిన 'యస్వియస్' ఖద్దరు ధారి, గాంధేయ వాది. ఉన్నత సాహితీ విలువల పున రుద్ధరణకోసం శ్రమించే సారస్వత వేత్త. యమ్మెస్ సుబ్బలక్ష్మి సదా శివమ్ దంపతులు స్వయంగా వచ్చి 'యస్వియస్' దంపతులని ఆశీర్వదిం చారు. మాజీ మంత్రి హెచ్‌వి హాండె రాజాజీ కాలం నాటి ముచ్చట్లు చెప్పారు. మరొక మాజీ మంత్రి ఆర్ యమ్ వీరప్పన్, ఇరవై రెండు వేల ఎనిమిది వందలేమిటి, మిగతాది నేనిస్తాను, పాతివేల పర్సు 'యస్వి యస్'కి ప్రజంట్ చేయండి - అన్నారు, నిరాడంబరంగా, గంభీరంగా, 'యస్వియస్'ని శతాయుష్కునిగా దీవిస్తూ జరిపిన సారస్వత సభ.

## ..... 07

ఒకరు మరొకరిని పోలి వుండరు - ప్రతి ఒక్కరూ తాము నిర్దేశించుకున్న శిఖరం చేరుకోవాలి. అది ఎలా సంభవ నీయమంటే, ఎవరికి వారు పూర్ణత్వం సాధించుకోవడం ద్వారా - అన్నాడు గొథె. పిల్లలకు సత్ప్రవర్తన, పెద్దలు విధించే శిక్షణ నుంచి గాక ఆ లేత మనసుల మధ్య సర్వసహజంగా అల్లుకుపోయే ప్రేమపాశం నుంచి జనించాలి - అనేది ఒక ఆదర్శంగా కనిపించవచ్చు. కాని, ఆ ఆదర్శానికి కట్టుబడ్డ ఒక దంపతులు, 55 ఏళ్ల క్రితం అయిదారుగురు పిల్లలతో స్థాపించిన విద్యాలయం, కొన్ని వేల

మంది స్త్రీ పురుషులలో మధురమైన శరద్రాత్రి వలె నిలిచింది. ఈనాటి 'ఫౌండర్స్ డే'కి ముఖ్యఅతిథిగా వచ్చిన కృష్ణకుమారి (రాయపేట హాస్పిటల్ లో పెద్ద డాక్టరు), అధ్యక్షునిగా వచ్చిన రాజామణి (మద్రాసు - దూరదర్శినిలో ప్రొడ్యూసర్) - ఆ శతసహస్ర విద్యార్థినీ విద్యార్థులలో యిరువురు మాత్రమే, ఇద్దరూ కూడా తమ చిన్ననాటి జ్ఞాపకాలు నెమరు వేసుకుంటూ తాము తన్మయులవటమేగాక శ్రోతలను రసానందలహరిలో ముంచారు. వేదిక మీదున్న శర్మా దంపతుల నిలువెత్తు చిత్రపటం చూస్తుంటే, ఎంత నిశ్శబ్దంగా జీవించి, దివిజలోకాలకు వెళ్లారో అని అనిపించకమానదు. ఆ పుణ్యమూర్తుల పరిచయ భాగ్యం ఎందరి జీవితాలనో పునీతం చేసింది; మరింకెందరికో వెలుగు నిచ్చింది.

..... 08

నిన్న, యివ్వాళ గార్డెన్ స్కూలు పండగలు, నిన్నటి రోజు వ్యవస్థాపకులని గుర్తు చేసుకు, అంజలి ఘటించేదయితే, ఇవ్వాళ బాలబాలికల వెరైటీ ఎంటర్‌టైన్‌మెంట్. రెండూ మ్యూజిక్ అకాడమీ హాలులోనే! నేటి ఉత్సవానికి ముఖ్య అతిథి రుడోల్ట్ ఎం భాషర్ ప్రతీ సంవత్సరానికి మల్లెనే, నాలుగైదేళ్ల నిండని పసివారి నృత్యం ఎంతో ముద్దుగా ఉంది. సరోజినీ నాయుడు కవిత నొకదాన్ని (బజారు) చాలా శ్రమకోర్చి, అతిమనోహరంగా ప్రదర్శించారు. శ్రమ అని ఎందుకంటున్నానంటే హైదరాబాదు బజారుని - పూలదండలు అమ్మేవారి దగ్గర్నుంచి బంగారు వస్తువులషాపు దాకా స్టేజి మీద చూపడం తేలికకాదు. ఈ ప్రదర్శన గణనీయంగా ఉంది. ఆ తర్వాత టిబెటన్ డాన్స్ మనని ముగ్ధులు గావిస్తుంది... మొత్తం రెండున్నర గంటల ప్రోగ్రామ్.. శర్మాదంపతుల ముగురమ్మాయిలు స్కూలు, హాస్టలూ, ఫారమ్ యిత్యాదుల నిర్వహణ బాధ్యత వహిస్తున్నారు. (గీతశర్మా, రుక్మిణి [illegible], శకుంతలా శర్మ)

.... 11

తెలుగు ప్రజా ఫెడరేషన్ దక్షిణ మద్రాసుశాఖ (Federation of Telugu People's Associations-South Madras Unit) ఫిలిమ్ ఛాంబర్ థియేటర్లో. మెరిటోరియస్ సర్వీస్‌కి 1992 ప్రెసిడెంట్ అవార్ అందుకున్న కె వి యస్ మూర్తి ఐపియస్‌కి (పోలీస్ డిప్యూటీ కమీషనర్ — ట్రాఫిక్); అమెరికాలోని ఆంధ్రా తెలుగు అసోసియేషన్ నుంచి జర్నలిస్టుగా 'శిరోమణి' బిరుదు అందుకున్న ఇంటూరి వెంకటేశ్వరరావుకి; అదే అసోసియేషన్ నుంచి ఫిలిం డైరక్టరుగా 'శిరోమణి' బిరుదు అందుకున్న కమలాకర కామేశ్వరరావుకి. యన్ యఫ్ డి సి ఛైర్‌మాన్ డివియస్

రాజు అధ్యక్షతని, సన్మానం గావించారు. ఫెడరేషన్ అధ్యక్షులు సియమ్‌కె రెడ్డి తమ కార్యక్రమావళి వివరించారు. కృష్ణా పుష్కరాల పుణ్యదినాన ఈ సన్మానోత్సవం జరగడం ముదావహమన్నారు కార్యక్రమ ప్రయోక్త రాళ్లబండి కామేశ్వర రావు. 'కన్యాశుల్కం'లోని ఘట్టం మాత్రం సందర్భోచితంగా లేదు. సన్మానితులు సముచిత రీతిని సమాధానం చెప్పారు. గౌరవ అతిథి యార్లగడ్డ శంభుప్రసాద్. కార్యదర్శి అనంతయ్య వందన సమర్పణ గావించారు. ఆ తర్వాత హరికథా కాలక్షేపం ఉన్నదిగాని అప్పటికే ఎనిమిదిన్నర అయింది.

## . . . . . 12

నిన్న సాయింత్రం ఛాంబర్లో చిత్తరంజన్, 'టానా' సత్యనారాయణ తలుస్థ పడ్డారు. మాటల సందర్భంగా, చిత్తరంజన్ "మన ఎవిఆర్‌జి వచ్చే వారం ఇండోనిషియా వెళ్తున్నారు. మిసెస్ కూడా వెంట వెళ్తున్నారు. నిన్నరాత్రే పదిహేను నిముషాల పాటు ఫోన్‌లో మాట్లాడాము - కొంచెం దగ్గుతున్నారు - కంఠం అంత బాగా లేదు. మందులు అవీ తీసుకెళ్ల మన్నాను" – అన్నారు. కాసేపు 'ఎవిఆర్‌జి' గురించే మాట్లాడుకున్నాం. ట్రాజడీ ఏమిటంటే, మేము ఆయన మాటలు చెప్పుకుంటున్న వేళకి, ఈ లోకంలో లేరాయన ; మధ్యాహ్నం మూడు గంటలకే ఐహిక బంధాల నుంచి విముక్తులయారు. మీటింగ్ నుంచి యింటికొచ్చాక, ఈ దుర్వార్త నాకు తెలిసింది ; వెంటనే 'ఐటిసి' గెస్ట్‌హవుజ్‌కి ఫోన్ చేస్తే, చిత్తరంజన్ రూమ్‌లో లేరు ; తెల్లారాక గాని తెలిపే అవకాశం లేక పోయింది. ఆ రాత్రి మంచం మీద నడుం వాల్చాను గాని కళ్లలో 'ఎవిఆర్‌జి' యే ; ఆయన రూపమే, ఆ వాక్కులే. ఆ మందస్మిత వదనమే, ఆ స్నేహ మధు పాత్రే - అటువంటి వ్యక్తులు చాలా అరుదు - మా అదృష్టం కొద్దీ, అనిర్వచనీయ భాగ్యమా అన్నట్లు ఆ పరిధిలోకి వెళ్లాము.

'యథా కాష్ఠంచ' కాష్ఠంచ, అని వాల్మీకి అన్నప్పటికీ, ఆ రెండు కట్టెలూ కాల ప్రవాహాన తేలి సాగుతున్నప్పుడు, వాటి మధ్యగల బాంధవ్యలతతో అమృత సోనలు లేవని ఎవరనగలరు ? అది స్వీయానుభూతిగా మాత్రమే మిగిలిపోతుంది – నిజమే ! కాని, స్వీయానుభూతిని చెప్పుకోవాలని, తన వాళ్లతో పంచుకోవాలని అనిపించడం కూడా అసహజం కాదేమో ! 1992 జులై 19వ తేదీ (ఆదివారం) ఉదయం, ఇడ్లీ దోసె బ్రేక్‌ఫాస్ట్ అయాక, 'ఎల్లయ్యా, అయ్యగారు సాయింత్రం ట్రయిన్‌కి వెళ్తున్నారు. ఆయన పనులన్నీ అయాక, సికింద్రాబాదులో రైలెక్కించి మరీ యింటికి రా' అని చెప్పారు డ్రైవర్‌కి. నిన్న ఉదయం, నన్ను రిసీవ్ చేసుకోవడానికి స్టేషన్ కొచ్చిన 'మారుతి' నిన్నరాత్రి పదిన్నరదాకా



నిజాం సంస్థానం రోజులలో తెలుగు వారికీ, తెలుగు భాషకు సమున్నత స్థానం కలిగించి, ఆంధ్ర మహా సభ ద్వారా అద్వితీయ సేవ చేసి. హైదరాబాదు తొలి మేయరుగా, ఆంధ్రప్రదేశ్ విధాన మండలి తొలి అధ్యక్షునిగా ప్రజాహిత రంగానికి వన్నె తెచ్చారు....

**పద్మభూషణ్ మాడపాటి హనుమంతరావు (1885-1970)**



కూరగాయ లమ్ముకొనే ఒక పేద వనిత చెప్పుతున్న [illegible] ఈ మధ్య తరగతి మహిళ మనసు ద్రవీభూతమయింది. [illegible] తనకు చేతనైనంత చేయాలని పూనుకున్నారామె. అహమ్మదాబాదులో తన వంటి వారిని కూడగట్టుకు ప్రారంభించిన SEWA నేడు శాఖోప శాఖలుగా విస్తరణ పొందింది. 1977లోనే మాగ్సేసే అవార్డు పొందిన అమృత హృదయిని....

—పద్మభూషణ్ ఇలా భట్

నా అధీనంలోనే ఉంది; ఇవ్వాళ రైలు ఎక్కేదాకా నా వద్దనే ఉంటుంది. అగస్టులో మద్రాసు రావచ్చునన్నారు. వద్దు అంటున్నా వినక, మెట్లు దిగి వచ్చి, కారులో కూచోబెట్టారు. అదే చివరి వీడ్కోలు; చిట్టచివరి కరచాలనం.

సుమారొక పదేళ్ల క్రితం 'వనిత' ఆఫీసునుంచి, 'విశాఖపట్నం నుంచి వచ్చిన ఒక దంపతులు మీ యిద్దరినీ చూడాలనుకుంటున్నారు. ఆయన ఫారెస్ట్ ఆఫీసరు; ఆమె మన పత్రికకు రాస్తూంటారు' - అన్నారు. నరసింహమో, ఈశ్వరో గుర్తులేదు. 'అడ్రస్ యివ్వండి - ఆరు గంటల దాకా యింట్లోనే వుంటాను' - అన్నాను. మూడున్నరకి కృష్ణమూర్తి, హేమలత వచ్చారు. దేవులపల్లివారితో పరిచయం, నండూరి వారితో బంధుత్వం, ఏలూరు ముచ్చట్లు యిత్యాదులతో మొదటి గంటలోనే ఎంతో దగ్గిరయారు. "పదకొండేళ్ల సెన్సారింగ్‌తో మాలతికి సినిమాలంటేనే మొహం మొత్తింది. నా విషయమంటారూ, ప్రతిక ఒకటి ఉంది గనక, వృత్తి ధర్మంలో భాగం. ఛాంబర్‌లో ప్రెస్‌షో ఉంది; మనం ముగ్గురం వెళదాం. షో అయాక మీరు 'ఐ ఐ టి కి, నేను కచ్చేరీ రోడ్‌కి" - అన్నాను. అలాగే వెళ్దామన్నారు - వెళ్లాం, సినిమా అయాక, వారు అటు, నేను ఇటు. అప్పట్లో ప్రతి రెండేసి నెలలకి వైజాగ్ పని వుండేది. 'ఈసారి మీరు వచ్చినప్పుడు ఫోన్ చేయండి' - అని చెప్పారు కృష్ణమూర్తిగారు.

ఆ తర్వాత రెండుసార్లు వైజాగ్ వెళ్లినప్పుడూ పని తెమలక ఫోన్ చేయలేదు. కొన్ని యాదృచ్ఛిక ఘటనలు, ఎలా అనిర్వచనీయ బంధాలకు, హేతుభూతమవుతాయో, తలుచుకున్న కొద్దీ ఆశ్చర్యంగా ఉంటుంది. ఆ మధ్యాహ్నం రెండు గంటలకి, డి యస్ రావు దంపతులని చూడటానికి భీమ్లీ వెళ్దామనుకున్నాను - 1983 ఫిబ్రవరి 4. 'టాక్సీ ఎందుకండీ? మా కారు పంపుతాను,' - అన్నారు ఐ ఒ సి రావుగారు. కారేదో ట్రబులిస్తున్నట్లు రెండుం పావుకి ఫోనులో తెలిసింది. 'అప్సరా' సమీపాన వెంటనే టాక్సీ లభ్యం కాలేదు. పగటి వేళ పుస్తకం చదువుకుంటూ హోటల్ రూమ్‌లో కూచోలేముకదా! కాంప్‌లు వుంటాయన్నారు కృష్ణమూర్తిగారు. అయినా, ఊళ్లో వున్నారేమో కనుక్కుందాం, భీమ్లీ ఎలానూ లేదు గనుక ఈపూట వారితో స్పెండ్ చేద్దాం' - అనుకుంటూ, డైరీ తిరిగేసి, వెనుక యిచ్చిన నెంబరుకి డయల్ చేశాను. ఆయనే రిసీవ్ చేసుకున్నారు. 'ఎక్కడున్నారు? అప్సరాలోనా? రూమ్ నెంబర్? డ్రయివర్ వస్తున్నాడు - మీరిక్కడికి వచ్చేయండి. మాట్లాడుకుందాం'.... పది నిముషాలలో డ్రయివర్ ప్రత్యక్షమయాడు.... వేడి వేడి పకోడీలు కొరుకుతూ, టీ సిప్ చేస్తున్నప్పుడు, యాదాలాపంగా భీమ్లీ మాట ఎత్తాను. 'మూడుంబావే

# దీపావళి శుభాకాంక్షలతో....

'దీపం జ్యోతి పరబ్రహ్మ - దీపం సర్వతమోపహః'

సి. యల్. నరసారెడ్డి
(నిర్మాత)

JAGATI

Deepavali 1992

కదా అయింది - ఇప్పుడు వెళ్ళాం.... హేమా, పది నిముషాలు - గెట్ రెడీ' అన్నారు .. బీచ్‌రోడ్డున కారు వెళ్తూండగా, సరుగుడు చెట్లు ఉప్పెనని ఎలా ఆపేదీతో ప్రారంభమైన మా సంభాషణ, రెండు హృదయాల అపురూప బాంధవ్యలత అయింది ఆ ఏటికాఏడు ఈ బాంధవ్యలత బలపడి మణిమయ కాంతులు ప్రసరింపజేసింది.

. . . . 15

శని ఆదివారాలలో ఏ క్లాసులోనూ టికెట్లు దొరక్కపోవడం, విజయవాడలో దిగివద్దామంటే కృష్ణా పుష్కరాల రద్దీ - వీటితో నిన్న సాయింత్రం చార్మినార్ ఎక్కి, ఈ ఉదయం వచ్చాము - మిసెస్ 'ఎవి అర్‌జి'ని (హేమలత) పల్కరించేందుకు, పరామర్శించేందుకు, కడపటి చూపు కరువైనా ఈ పట్టుకుచ్చుల మైత్రీలత వాడదు సుమండీ అని ఈ దుఃఖ సమయంలో కాస్త ధైర్యం చెప్పేందుకు! హేమలతగారు స్వతహాగా గుండె నిబ్బరంగల మనిషి - కాని, జీవిత భాగస్వామిని కోల్పోయి, సమస్తం శూన్యమైనప్పుడు, ఎంతటి వారికీ, దారి వెతుక్కు, నిలదొక్కుకోవడం, కష్ట నిష్ఠూరాలతో కూడిన కారడవి. ఆర్ధికంగా ఎటువంటి సమస్యలూ లేవు - కాని, యిల్లు సరిదిద్దుకు, కొత్తబాట తనకి తానుగా వేసుకోవాలి. ఇన్నాళ్లూ కృష్ణమూర్తి గారి బాట వెంట నడిచిన వ్యక్తికి, తన మార్గం ఏర్పరుచుకునేందుకు కొంత టైము పడుతుంది. మాలతి, హేమలత ఒకర్నొకరు పెనవేసుకు కన్నీటి ధారలయాక...

"రెండు మూడు రోజులుగా కాస్త దగ్గు వస్తోంది - అలా దగ్గు రావడం, దానంతటదే తగ్గడం కొత్తకాదు; మందులు వేసుకుంటున్నారు. శుక్రవారం పొద్దుట పది గంటలకు మామూలుగానే ఆఫీసుకి వెళ్లారు - రెండేళ్లుగా ఆయన డ్రయివ్ చేయటం లేదు - మీకు తెలుసుగా! వచ్చే వారం ఇండొనీషియాకి మా యిద్దరి టికెట్లు, అక్కడ హొటల్ - ఆ యరేంజిమెంట్స్ అన్నీ అయిపోయాయి. ఈ మధ్య ఢిల్లీ కొకసారి, పాట్నా కొకసారి తను ఒక్కరూ వెళ్లి వచ్చారు. 'ప్రతి ఊరూ నేనెందుకు, మీరొక్కరూ వెళ్లిరండి - మీకు ఆ మనోబలం రావాలి' - అని నేనే ప్రోత్సహించి పంపాను. రెండేళ్ల క్రితం ఆయన ఆరోగ్యం కొంచెం సడలినప్పట్నుంచీ, ఎక్కడికీ ఒక్కరుగా వెళ్లడం లేదు. నన్ను తోడు రమ్మంటున్నారు. మన దేశంలో అయితే ఫరవాలేదు - విదేశాలకైతే తప్పక వెంటనుండాలనుకున్నాను. అందుకనే, యింట్లో అనేక సమస్యలు వున్నప్పటికీ ఇండొనీషియాకి వొప్పుకున్నాను.... ఆఫీసులో రొటీన్ వర్క్ చూసుకుంటూవుండగా, మా ఫామిలీ ఫ్రెండ్ నారాయణరావుగారు వచ్చారట; ఇద్దరూ కాఫీ తీసుకుంటున్నారు. రెండు గుటకలు వేశాక ఈయనకు దగ్గు తెరలా వచ్చిందట. ఎంతకీ

తగ్గక, ఈయన వాగురుస్తూ, ఆయాస పడుతూండేసరికి, నారాయణరావు గారు, ఆఫీసువారు నైజామ్ హాస్పిటల్‌కి తీసుకు వెళ్లి, 'కంగారేమీ లేదు - హాస్పిటల్‌కి రండి' - అని ఫోన్ చేశారు. కంగారు పడవద్దని చెప్పినప్పటికీ కాళ్లూ చేతులూ ఆడవు కద !

"ఇంట్లో వున్న డబ్బు బాగ్‌లో వేసుకొని వెంటనే వెళ్లాను. హాయిగా మాట్లాడుతున్నారు; తన కేమీ లేదనీ, మామూలుగానే వున్నాననీ అంటున్నారు ; తనకి స్ట్రెచ్చరెందుకు, నడిచి రాగలనని డాక్టర్లకి చెబుతున్నారు. 'మీరు రాగలరు గాని స్ట్రెయిన్ ఎందుకు ?' - అన్నారు డాక్టరుగారు. 'ఇంటెన్సివ్ కేర్'లోని వెళ్లాక, 'హేమా' అని నన్ను పిలుస్తూనే వున్నారు ; 'పక్కనే వున్నానండి' అని చెబుతున్నాను. కాని, అప్పటికే డాక్టరుగారు నా చెవిని వేశారు - బిపి పడిపోతోందని ! వొళ్లు మంచులా ఉంది. బిపి పడిపోకుండా యింజక్షన్ యిచ్చారు ; ఆరాటపడుతూంటే ఆక్సిజన్ పెట్టారు ; 'ఎ టీమ్ ఆఫ్ డాక్టర్స్ డిడ్ దెయిర్ బెస్ట్ ;' రెండున్నర మూడయే సరికి అంతా అయిపోయింది" - అన్నారు హేమలత, కృష్ణమూర్తిగారి చివరి మూడు గంటలూ చెబుతూ.

'కాతే కాంతా కస్తే పుత్ర - స్సంసారోయ మతీవ విచిత్రః - కస్యత్వంవా కుత ఆయాత - స్తత్వం చింతయ తదిహ భ్రాతః" - పన్నెండు వందల ఏళ్ల క్రితం ఆది శంకరులు చెప్పిన పలుకులు, యిటివంటి వేళప్పుడే గుర్తు కొస్తాయి.... కృష్ణమూర్తిగారికి ముగ్గురమ్మాయిలు ; ఒక అబ్బాయి, పెద్దమ్మాయి అరవిందకు పెళ్లి అయింది - మిగతా యిద్దరిలో ఒకరు పిహెచ్‌డి ; మరొకరు యింజనీరు - అబ్బాయి చదువు యింకా పూర్తి కాలేదు.

ఫారెస్ట్రీ గురించి కృష్ణమూర్తిగారు అపూర్వ అధికారిక గ్రంథాలు యింగ్లీషులోను, తెలుగులోను వ్రాశారు. ఆయన కేవలం ఒక ఛీఫ్ కన్సర్వేటర్ కాదు ; మన అటవీ సంపద గురించి సామాన్య ప్రజలకు సదవగాహన వుండాలని, ఆ అవగాహన ప్రజానీకంలో కలిగించేందుకు ఆరాటపడి, కలంగా చేబట్టిన రచనా పిపాసి. బాధ్యతాయుత మగు ఉద్యోగ నిర్వహణగా చేస్తూ, ఆణిముత్యాల వంటి గ్రంథాలు వెలువరించారు. యూకలిప్టస్‌పై నిర్హేతుకంగా చెలరేగిన దుష్ప్రచారం ఖండిస్తూ 'నీలగిరి నీలాప నిందలు' రాశారు ; అలాగే టేకు చెట్లు, ప్రకటన దారులు చెబుతున్నంత అధిక లాభాలు సమకూర్చవు - అని హెచ్చరిస్తూ, 'అన్నదాత' ద్వారా ఒక బుక్‌లెట్ విడుదల చేశారు. 'ఇండియన్ ఫారెస్ట్రీ' గురించి ఆయన ఒక ప్రామాణిక గ్రంథం రచించారు. ఎన్నో జాతీయ, అంతర్జాతీయ సెమినార్లలో పాల్గొన్న బహుముఖ ప్రజ్ఞాశాలి డా॥ ఎవిఆర్‌జి కృష్ణమూర్తి ఐ.ఎఫ్.ఎస్. ఛీఫ్ కన్సర్వేటర్ హోదాలో ఉద్యోగి ఆంధ్ర ప్రభుత్వ అటవీ శాఖలో

అడిషనల్ సెక్రటరీ అయారు. ఇంకో పది నెలలలో రిటైరవాల్సి వుంది. రిటైరయినా అటువంటి నిపుణులని వొదిలిపెట్టరు 'టీక్‌వుడ్'కి సంబంధించి ఆయన నిష్ణాతులు ; 'ఐ.ఎఫ్.ఎస్' గాక, డాక్టరేట్ కూడా పొందారు. పదవీ కాలంలోనే తనువు చాలించాలనే ఆంతరంగిక వాంఛ ఆయనలో నిగూఢంగా వుండేదేమో.... అన్నిటికీ మించి ఆయనలోని మానవత్వమూ, స్నేహశీలత అనుపమానమైనవి.... 'తరువు లతి రస ఫలభార గురుత గాంచు - నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుం - డుద్ధతులుగారు బుధులు సమృద్ధి చేత - జగతి నుపకర్తలకు నిది సహజ గుణము' - అంటాడు భర్తృహరి. అటువంటి సహజగుణం కృష్ణమూర్తి గారిలోని స్నేహశీలత అని వొప్పుకుంటూ, ఆయనని తెలిసిన వారందరూ బాష్పాంజలితో వినమ్రులవుతారు.

..... 18

"1984 ఎన్నికలలో ఒకే పార్టీకి చెందిన సభ్యులు లోక్‌సభలో 400 పైగా ఉన్నారు. అయితే ఓట్ల లెక్కింపులో వారికొచ్చిన మెజారిటీ నాలుగు శాతం మాత్రమే.... రెండు

**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**

**M. V. S. Prasad,** I.A.S., *Tirupati*

Executive Officer.

Dear devotee,

There is no gift worthier and nobler than Annadana. In our country, giving food to the needy and poor is not merely a service, but a hoary tradition practised since Vedic times. It is said that one who offers food is placed among the devas.

Sri Venkateswara Nitya Annadana Scheme, aimed at providing free and wholesome food to the devotees visiting Tirumala, launched by the T. T. Devasthanams in 1985, has become a glorious success. There has been an overwhelming response from philanthropists all over India.

The quality of food was also immensely appreciated by the public. The benefit of this unique Annadana Scheme is now enjoyed by most of the pilgrims at Tirumala.

With a view to providing a wonderful opportunity to the common devotee to contribute his mite in the Nitya Annadana Scheme, the T. T. Devasthanams has recently decided to slash the slab considerably.

Enough you just pay Rs 1000 or in muliples and serve a noble and befitting cause, thus enabling T. T. D. to preserve the timeless tradition of Annadana.

If your heart goes out to those devotees coming from farflung areas, join the modified *Nitya Annadana Scheme* and have the pride of partnership in this sacied service.

अन्ने श्रितानि भूतानि अन्नं प्राणमिति श्रुतिः ।
तस्मादान्न प्रदातव्यं अन्न हि परमं हविः ॥

—बोधायनधर्मसूत्रम्

Vedas affirm that food is life animating the inner energy. Annadana' is a priceless measure transcending the earthly qualities. Annadana should therefore, be done.

—*Bodhayana Dharma Sutra.*

Thanking you,

Yours sincerely,
M. V. S. PRASAD.

పార్టీల మధ్య పోటీయా, లేక, అనేక పార్టీల మధ్య బలాబలాల నిరూపణా అనేది ప్రజాస్వామిక దేశాలన్నిటా కనిపిస్తున్న సమస్య. టు - పార్టీ సిస్టమ్, మల్టీ పార్టీ సిస్టమ్.... మల్టీ పార్టీ సిస్టమ్‌లో ఏ ఒక్క పార్టీకి, పూర్తి మెజారిటీ లభించి, ప్రభుత్వాన్ని ఏర్పరచగల అవకాశం లేకపోవచ్చు. అప్పుడు వారు మరొక పార్టీని తమతో కలుపుకు, మిశ్రమ ప్రభుత్వాన్ని నిర్మించే అవశ్యకత ఏర్పడుతుంది. ఏకపక్ష ప్రభుత్వానికి వుండే మద్దతు, మిశ్రమ ప్రభుత్వానికి లభించకపోవడం సర్వ సాధారణం. అయితే, ప్రజాస్వామిక శక్తులు ఏ ఒక్క పార్టీమీద భరోసా వుంచడంలేదు - ఇది రాజకీయ వాస్తవికత... అవినీతి, లంచగొండితనం నిర్మూలించేందుకు ఎలక్టరల్ రిఫార్మ్స్ తప్పనిసరి. కాగా, ప్రజాస్వామిక మనేది ప్రజల 'డిసిప్లిన్' (క్రమశిక్షణ) నుంచి ఊపిరిపోసుకుంటుంది. పౌర జీవనంలోను, శాసనసభలలోను సుశిక్షణ నెలకొన్న మీదటనే ప్రజాస్వామిక విధానం అధిక సంఖ్యాకులకు మేలు చేయగలుగుతుంది" - అన్నారు, మాజీ రాష్ట్రపతి ఆర్ వెంకట్రామన్, భారతీయ విద్యాభవన్‌లో, సంతానం స్మారకోపన్యాస మిస్తూ.... కె సంతానం ఒకనాటి కేంద్రమంత్రి, గొప్ప గాంధేయవాది, ప్రజాహిత రంగం (పబ్లిక్ లైఫ్) నిర్మలంగాను, నిష్కళంకంగాను వుండాలని పోరాడిన ధీరచిత్తుడాయన. సంతానం పెద్ద కుమారుడు కస్తూరి, తండ్రిగారి స్మృత్యర్థం, ప్రతి ఏటా ఈ స్మారకోపన్యాసానికి ఒక సుప్రసిద్ధుని అహ్వానిస్తారు... సభాధ్యక్షత వహించిన జస్టిస్ ఇస్మయిల్, వెంకట్రామన్ తమిళనాడులోని పరిశ్రమాభివృద్ధికి ఎలా తోడ్పడినదీ చెబుతూ, ఆయన రాజకీయ జీవితంలోని ప్రధాన ఘట్టాలు వివరించారు. మాజీ ఉప రాష్ట్రపతి హృదయతుల్లా మరణం పట్ల సంతాపం వెలిబుచ్చుతూ, సభవారు రెండు నిముషాలు మౌనం పాటించారు. హృదయతుల్లా అక్షరాలా సౌజన్యమూర్తి - అని అందరూ అంటారు. అటువంటి సజ్జన శ్రేష్ఠుడు తెర వెనక్కి తప్పుకున్నారు.

. . . . . 20

'కథ కళలకు కేంద్ర బందువు' అనే 'కథా వేదిక' ఈ సాయింత్రం వెంకటేశ్వర కళ్యాణ మండపంలో, ఎయస్ రామన్ అధ్యక్షులుగా, చాసో (చాగంటి సోమయాజులు) ముఖ్య అతిథిగా ద్వితీయ వార్షికోత్సవం జరుపుతుంది. ఈ సందర్భంగా 'చాసో' మీద తీస్తున్న డాక్యుమెంటరీ ప్రారంభోత్సవానికి శ్రీరాములు కెమెరా స్విచాన్ చేశారు. కన్వీనరు వుప్పల నరసింహం వార్షిక నివేదిక సమర్పించారు. సభ మొదలు పెట్టడానికే ముప్పావుగంట అలస్యమవటం వల్ల, చిన్నప్పుడు అయిదు కథలు రాసి యింక హొద్దనుకున్న బియస్ ఆర్ స్వాగత వాక్యాలు, కష్టనిష్ఠూరాల కోర్చి 'కథావేదిక' ఉద్యమం విజయ

వంతంగా ముందుకి తీసుకు వెళ్తున్న కన్వీనరు (వుప్పల నరసింహం) నివేదికలో కొంత భాగమూ మాత్రమే విన గలిగాను - అప్పటికే ఏడూ ఏడై అయింది. ఎనిమిదిన్నరకి గెస్టులు వస్తున్నారు. అంచేత, మధ్యలో రాకతప్ప లేదు.

..... 21

సంగీత విద్యలో గాత్రం కంటె వాద్యం గొప్పదంటారు. గాత్ర పాట వింటున్నప్పుడు భాషా జ్ఞానమూ పదాల పొందిక కొంతవరకూ ఉపకరిస్తాయి. వాద్యం మీద అయినప్పుడు అది మనకు తెలిసిన పాట అయితే, ఎక్కువ ఆనందిస్తాము; తెలియక పోయినా ఆ శబ్ద సౌకుమార్యానికీ, లయగతులకీ ఆనందిస్తాము. ఇవ్వాళ మ్యూజిక్ అకాడమీలో ఐసిసిఆర్ - యలైయన్స్ ఫ్రాంకె (Indian Council for Cultural Relations and Alliance Francase) సంయుక్తంగా ఏర్పాటు చేసిన 'మోడరన్ డాన్స్ ప్రోగ్రామ్'లో డాన్సర్ల విన్యాసమూ, భావ ప్రకటన, కదలికల వేగమూ కంటె వాద్యం (క్లారినెట్) ప్రేక్షకులని పరవశింపజేసింది. ఒక యువకుడు, ఒక యువతి, ఒక వాద్యకారుడు - ముగ్గురే స్టేజి మీద! లైటింగ్ ఎఫెక్ట్స్ మాత్రం అద్భుతంగా వున్నాయి. ఈ వెలుగు చీకట్లు, ఆ శబ్ద స్రవంతి మధ్య, ఒక నర నారీ జంట శబ్దానికి అనుగుణంగా అడుగులు వేస్తూ, మైనపు ముద్దలా శరీరాన్ని

తిప్పుతూ, రసస్ఫూర్తి కలిగిస్తారు. ప్రోగ్రామ్ ఉత్తరార్ధంలో యిరువురు వనితలు, యిదే తీరున నాట్యగతులు ప్రదర్శిస్తారు. ఈసారి క్లారినెట్‌కి తోడుగా మృదంగం ఉంది. ఏ నాట్యానికైనా అర్ధం కాదు, రసం ప్రధానం.

..... 25

"సకుటుంబంగా వెళ్లి, చూసి ఆనందించగల సినిమాలు అరుదవుతున్న కాలంలో 'పెద్దరికం' చిత్రాన్ని ప్రజలు ఆదరించారూ అంటే, ఇందులో కోపం కనిపిస్తుంది గాని ప్రతీకారం లేదు. పగ వుంది గాని పట్టరాని ద్వేషం లేదు. బసవ పున్నమ్మ, పరశురామయ్య యిద్దరి పెద్దరికం పట్ల విధేయత ఉంది. ఎక్కడికి కెళ్లావూ అంటే, 'పక్కింటి పెళ్లాం' దగ్గిరకి అని అబ్బాయీ, 'ఎదురింటి మొగుడి' దగ్గిరికి అని అమ్మాయి అనే రోజులలో, పిక్చర్స్ టైటిల్సే అంత ఘోరంగా వుంటున్న రోజులలో, పెద్దరికం అనే మాట కొంత సదభిప్రాయాన్నీ కలిగించింది. రాజకీయ నాయకులైనా, సినీ నిర్మాతలైనా, తమ బాధ్యతని విస్మరిస్తే, ప్రజలు వూరుకోరు" - అన్నారు శత దినోత్సవానికి ముఖ్య అతిధిగా విచ్చేసిన నన్నపనేని రాజుకుమారి - .... "పొట్టివాడు గట్టివాడు - అని నిరూపించుకున్నారు రత్నం. ఇవ్వాళ నేను వచ్చినది ముఖ్యంగా రత్నాన్ని ఆశీర్వదించడానికి" - అన్నారు బాను మతి. సెన్సారింగ్ విధానం, మద్యపాన నిషేధం - వీటి గురించి తన అభిప్రాయాలు చెప్పారు మురళీమోహన్. పరుచూరి వెంకటేశ్వరరావు ఈ పిక్చర్లో పాల్గొన్న కళాకారులని, సాంకేతిక నిపుణులని వేదిక మీదకు ఆహ్వానించి, కార్యక్రమ నిర్వాహణ మురళీమోహన్‌కి అప్పచెప్పారు. 'పెద్దరికం' ఏభై రోజులు అయ్యాక దర్శకనిర్మాత ఎఎమ్ రత్నాన్ని అభినందిస్తూ, తెలుగు ఫిలిమ్ జర్నలిస్టులు 'తాజ్'లో చిన్న పార్టీ యిచ్చారు. ఇవ్వాళ ఈ నూరు రోజుల పండగ విజయా శేష్‌మహల్‌లో సూర్యాచిత్రా వారిది. నెమ్మది, పట్టుదల గల ఎఎమ్ రత్నం ఎన్నో ఉన్నత శిఖరాలు అధిరోహించ గల సమర్థులు .... పిఆర్ఒ : జగన్.

..... 26

మూడుకోట్ల వ్యయంతో, పవిత్రన్ దర్శకత్వంలో, 1992 ఆగస్టు 14వ తేదీన రిలీజైన 'సూర్యన్' తమిళంలో సూపర్‌హిట్. దానిని కుంజుమోహన్, 'మండే సూర్యుడు'గా (రచనా పిక్చర్స్), తెలుగులో గీతాఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్స్ ద్వారా విడుదల చేస్తున్నారు. మాటలు - పాటలు : రాజశ్రీ .... రోజా, శరత్ కుమారులు హీరో హీరోయిన్‌లు ; మనోరమ, ఆంటోనీ, విజయకుమార్, రాజన్ మున్నగువారు. దేవా సంగీతం పాత్రికేయుల కోసం యివ్వాళ దేవీ -

శ్రీదేవీ'లో ప్రదర్శించిన పాటలూ, వాళ్ల జలదరించే పైట్సూను. మనో హర సన్నివేశాలలో అందాలు వెదజల్లే నాట్యాలు, రాజస్థాన్ ఎడారిలోని ఒంటెల బారు, కేరళలోని ఏనుగులు కంపనెత్తడం - యిలాంటివి చూశాక క్లయిమాక్స్ చిత్రీకరణకు 33లక్షలు వ్యయమయిందంటే ఆశ్చర్యం కలగ లేదు ముక్కుకి సూటిగా పోయే నిష్కళంకచరితుడు, నిప్పులు చెరిగే గ్రీష్మం లాటివాడు ఈ మాదిరి భారీ చిత్రాలకు కథానాయకుడవటం తప్పని సరి. విశుద్ధ మాతృప్రేమ, మల్లెల తలపు అల్లరి వలపు చిలికే సిరివానలో వయసూ సొగసూ తడపటం, గుండె లలో ముత్యాల పంట - యిత్యాదులు. కథా గమనంలో రసోద్దీపిత అధ్యా యాలు. అపురూప దృశ్య చయనికతో ప్రేక్షకులని ఆనందపరిచే ఈ చిత్రం అక్టోబరులో రిలీజవుతుంది.... పిఆర్ఒ : అర్జునరావు.

.....27

"పత్రికలన్నీ పారిశ్రామిక వేత్తల, ధనస్వాముల హస్తగతమై, వారి అభీ ష్టాలకు అనుగుణంగా నడుస్తున్న రోజులలో, ఒక ఆరోగ్యవంతమగు పత్రిక, తెలుగు సినీ పరిశ్రమకు యితోధికంగా సాయపడాలనుకొనే పత్రిక, తృతీయ వార్షికోత్సవం జరుపు కోవడం ఎంతో సంతోషించ దగ్గ విషయం. పత్రికా నిర్వహణలో ఎటు వంటి సాధక బాధకాలు వున్నాయో స్వానుభవంతో నాకు తెలుసు. పిక్చర్ రిలీజైన మూడో రోజునే అది సూపర్ హిట్ అనే ప్రకటనలు వసూ వుంటాయి. ఈ 'సినిమాట్రేడ్ గైడ్' వారు ఆయా కేంద్రాలలో ఏ ఏ పిక్చరు ఎంతెంత వసూలు చేసినదీ, అంకెలతో అచ్చువేస్తున్నప్పుడు కొందరికి కంటకంగా ఉంటుంది. కాని, వున్న నిజం చెప్పేందుకు వీరు వెనకాడటం లేదు; అది వెల్లడించడం తమ బాధ్యతగా భావిస్తున్నారు. అందుకు ఈ పత్రికా నిర్వాహకులు ఎంతో అభినందనీయులు. తెలుగు సినీ పరిశ్రమ, వీరు చేస్తున్న మంచి పనికి, ప్రోత్సాహ సహకారాల నివ్వ గలదని ఆశిస్తున్నాను" - అన్నారు దాసరి నారాయణరావు, 'పామ్‌గ్రోవ్' లో, - బొంబయి నుంచి ఒకప్పుడు 'ట్రేడ్‌గైడ్' పేరుతో వచ్చిన 'సైక్లొ స్టయిల్' బులెటిన్ గురించి సందర్భ వశాన పేర్కొంటూ! సినీ పరిశ్రమ సక్రమాభివృద్ధికి అటువంటి 'గైడ్స్' ఎంతో అవసరమన్నారు... "మొదట్లో ఈ పత్రిక చూసినప్పుడు యిది ఎంత కాలం నిలుస్తుందో అని సందేహిం చాను. మూడేళ్లు పూర్తిచేసుకో గలి గిందంటే, అది నడిపేవారి పట్టుదల, కార్యదక్షత, వారికి నా అభి నందనలు" - అన్నారు అల్లు అరవింద్. అయిదు వందలకు పైగా అనువాద చిత్రాల రాజశ్రీ, 'శంకరా భరణం'తో ఒకమైలురాయి స్థాపించి 'ఆపద్బాంధవుని' నిర్మించిన ఏడిద నాగేశ్వరరావు, 'కాలేజీ బుల్లోడి' ని శతదినోత్సవానికి తీసుకు వెళ్తూ,

'కస్టమ్స్ ఆఫీసరు'ని పరిచయ చేస్తున్న కాట్రగడ్డ ప్రసాద్ 'సినిమా ట్రేడ్ గైడ్'ని ఆశీర్వదించారు; అభినందించారు. ఈ పత్రిక నేపథ్యంలో వున్న ముఖ్యులు : అర్జునరావు, వెంకటేశ్వరరావు, కలిదిండి జయ.... 'సినిమా ట్రేడ్ గైడ్'కి మా మనః పూర్వక శుభాకాంక్షలు. నిష్పాక్షికమూ, ఆరోగ్యవంతమూ అగు యిటువంటి ప్రచురణలే పత్రికా రంగానికి వెలుగు దివ్వెలు.

## అక్టోబరు 01, 1992

"షాతిక సంవత్సరాల పండగ ఒక విద్యా సంస్థ పురోగమనంలో మైలురాయి వంటిది. కార్యదర్శులు, దీక్షామూర్తి అయిన గోవిందరావు, రత్నకుమారి స్థాపించిన శ్రీనివాస గ్రూప్ స్కూల్సు, ఆదర్శప్రాయమగు ప్రాథమిక విద్యకు పేరు బడ్డాయి చిన్నతనంలో వేసిన మంచి విత్తనమే సత్ఫలితాల నిస్తుందనేది కొత్తగా చెప్పుకోనక్కరలేదు. సేవా తత్పరులైన లయన్ కె వి గోవిందరావుకి నా శుభాకాంక్షలు" - అన్నారు రజతోత్సవానికి అధ్యక్షత వహించిన మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి ఎ అర్ లక్ష్మణన్. యమ్‌జి అర్ మెడికల్ యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ బిషి రాజన్, పాండుచ్చేరి కేంద్ర విశ్వ విద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు కె వెంకట సుబ్రమణియన్‌ని ఈ సందర్భంగా ప్రసంగించారు.



## ముఖ చిత్రం



తమసో మా జ్యోతిర్గమయ - చీకటి నుంచి వెలుగులోకి, దీపాల తోరణాలు వెలుగుకి పిలుపు. అవిద్య, అజ్ఞానం, అసంపూర్ణత - వాటిని జయించడమే మానవుని నిరంతర తాపత్రయం. 2500 సం॥ల క్రితం గౌతమ బుద్ధుడు ఈ పవిత్ర భారతావనిలో జన్మించి, మూఢాచారాలలో మగ్గి పోవద్దనీ, అహింస, భూతదయ - ఈ రెండే సర్వజన శ్రేయస్సుకీ, లోకశాంతికీ దారి చూపే కాంతిరేఖలనీ అన్నాడు. బుద్ధం, ధమ్మం, సంఘం శరణమన్నారు భిక్కులు. పుట్టిన చోటునుంచి తరిమి వేయబడ్డ బౌద్ధం, ఆసియా ఖండమంతటా వ్యాపించి, రూపాంతరాలు పొందింది ... గుప్త విద్యకు చిహ్నమైన అయిదు బుద్ధ శిల్పాలలో ఇది ఒకటి. 12వ శతాబ్ది జపాన్‌లోని 91 సెంటీమీటర్ల ఎత్తుగల పెయింటింగ్‌కి ఇది ప్రతిరూపం. పంచభూతాలైన పృథ్వి, అగ్ని, జలము, వాయువు, ఆకాశము షింగాన్ గుప్త బౌద్ధకళలో సంకేతాలవుతాయి. 1988లో కొలోన్ నగరంలో ఈ కళాఖండాల ఎగ్జిబిషన్ జరిగింది.... ముఖచిత్రం బొమ్మ : 'జర్మన్ ట్రిబ్యూన్' సౌజన్యంతో.



# చైనీయ సూక్తులు

చినిగిన తాళ పత్రాలని చీకి పోయిన దారంతో భద్రపరిచిన 'సత్యము' అనే పుస్తకం, ప్రతిమనిషి హృదయంలోనూ ఉంది. అంతేకాదు, వలపుగీతికా, రసరమ్య నృత్యమూ ప్రకృతి రాగం మాదిరి ప్రతిమనిషి హృదయంలోనూ ఉన్నాయి. బయట ప్రపంచపు దుమ్ము తుడిచేస్తే గాని, అంత రంగాన ఆనంద లహరి జనించదు.

✠ ✠ ✠

వెదురు పొదల ద్వారా గాలి వీచి నప్పుడు, ఆ శబ్దాన్ని అవి పట్టుకో లేవు. నీటి కొంగలు జలాశయం పై ఎగురుతున్నప్పుడే వాటి నీడలు నీటిపై నిలుస్తాయి : అలాగే, ప్రాజ్ఞుడు ప్రత్యక్ష ఘటనకే, కళ్లముందు జరుగుతున్న దానికే, స్పందిస్తాడు - ఆ తర్వాత మనోవికారం ఉండదు.

✠ ✠ ✠

పచ్చటి ఆకులు రెపరెప లాడగా గుమ్మం ముందు రాలిన పువ్వులని ఏరితే, అది కవితా వస్తువు అవుతుంది. ప్రాతఃకాలపు పొగ మంచుని, పచ్చటి కాంతి వెల్లువలా చీల్చే మేఘపంక్తిని, కిటికీలోనుంచి చూస్తూ తన్మయత్వం పొందగలగడమే వివేక మన్నారు ప్రాచీనులు.

☘ ☘ ☘

ఈ పర్వతాలు, నదులు, ఈ భూమి యావత్తూ మట్టిలోనుంచి పుట్టింది - మట్టిలో కలిసిపోతుంది. ఈ రక్త మాంసాలు, ఈ శరీరమూ ఒక నీడ వంటివి. నీడ నీడే - అందులో 'నిజం' లేదు - అని మనోగతాన తెలుసుకుంటేనే, మనసు తేలిక అవుతుంది.

☘ ☘ ☘

పురుగులు అసహ్యంగా ఉంటాయి. కాని, గొంగళీపురుగు నుంచే అందమైన సీతాకోక చిలుక పుడుతుంది. బయట పోసిన పెంట అసహ్యంగా ఉంటుంది. కాని, ఆ పెంట నుంచే వేసవి చంద్రు నికి దీటైన మిణుగురులు జనిస్తు న్నాయి. మాలిన్యం నుంచి శుభ్రత, విషాదం నుంచి వెలుగు వుద్భవిస్తు న్నాయని మనం తెలుసుకోవాలి.

☘ ☘ ☘

మనసు మంచి ముత్యంలాటిది. కోరికలు చుట్టుముట్టినప్పుడు ఆ మంచి ముత్యాన్ని దుమ్మూ ధూ దుట్రా అలుము కుంటాయి. మోహపాశానికి వశమై నప్పుడు, ఆ మంచి ముత్యం వెండి బంగారాలలో బందీ అవుతుంది. ఆ మంచి ముత్యాన్ని ప్రలోభరహితంగా, పరిశుభ్రంగా వుంచుకున్న వాడే జ్ఞాని.

☘ ☘ ☘

సిరిసంపదల నిల్వలు అధికమైన కొద్దీ నష్టం ఎక్కువ. ఎత్తు పెరిగిన కొద్దీ పతనవేగం ఎక్కువ.

జీవన వ్యాపారమంతా చదరంగం ఆట వంటిది - తీవ్రంగా చలించని వారే చక్కటి ఆటగాళ్లు అవుతారు. జీవితమొక మృణ్మయ పాత్ర - పగిలిన మీదటగాని యిది మహాశూన్యం లోనిదిగా అభివ్యక్తం కాదు.

స్పందన మానవ స్వభావంలో ఒక భాగం; స్పందన లేకుండా మానవస్వభావం లేదు. సముచితమైన కోరికలు లేకుండా సత్య స్వరూపం అవగతం కాదు. అంచేత, ఉన్నత మానవుడు, స్వభావంలోని స్పందనలు అదుపులో పెట్టుకు, కోరికల నిర్మూలనగాక వాటిని తగ్గించుకుంటాడు.

☘ ☘ ☘

నేను ఒక కొలిమి (Furnace) అయినప్పుడు, అందులో కాల్చేది బంగారమయితేనేమి, ఇనుము అయితే నేమి? నేను ఒక సముద్రాన్నో మహానదినో అయినప్పుడు నాలో కలిసేది మురుగు నీటి కాల్వ అయితేనేమి, మంచి నీటివాగు అయితేనేమి!

☘ ☘ ☘

సమస్యల వలయంతో సమాధాన పడటం, నర్తించే పూల మధ్య తుమ్మెదల ఝుంకారం వంటిది. ఘటనానంతరం మనసు, పూర్ణచంద్ర బింబంలా పాత్రలోని జలంలా వలయాకృతి దాలుస్తుంది.

☘ ☘ ☘

రూపాన్ని, లేక కురూపాన్ని (Beauty on Ugliness) అనుకరించేందుకు నటులు రంగు పూసుకుంటారు; పాటలు పూర్తయి, ప్రేక్షకులు వెళ్లిపోయాక, ఆ రూపం ఏమయినట్లు? చదరంగం బల్లముందు యిరువైపులా కూచుని, గెలుపు ఓటమిలకు ప్రతి ఎత్తూ ఎంతో ఆలోచించి వేస్తారు. ఆట ముగిసి యిరువురి బలాలూ తిరిగే పేరుస్తున్నప్పుడు, ఎవరు నెగ్గినట్టు ఎవరు ఓడినట్లు?

☘ ☘ ☘

మండే కోరిక అగ్ని గుండంలో పడవేస్తుంది; ఐశ్వర్య తృష్ణ కష్టాల కడలిలో జారవిడుస్తుంది. మన మనసు పరిశుద్ధమైనప్పుడు కోరికలోని మంట, సరసీరుహ మవుతుంది. స్వాప్నిక జగతి నుంచి మన మనసు మేలుకుంటే, ఈ జీవితనౌక ఆవలి తీరంలో లంగరు వేస్తుంది.

☘ ☘ ☘

సప్తసముద్రాల రుచి నీటి బిందువులో ఉంది - యితరము లక్కర్లేదు. సహస్రప్రవాహాలలో చంద్రుని ప్రతిరూపం కనబడుతోంది - కాని, చంద్రుడు ఒక్కడే - మనసు చంద్రకాంతిలా ఉండాలి.

☘ ☘ ☘

JAGATI Telugu Monthly ... Edited, Printed and Published by NR Chendur at MANASA PRESS, No 2 Kutchery Road, Mylapore, Madras 600 004